జలుబు
నొప్పులతో
మీ బిడ్డను
బాధపడనీయకండి

**విక్స్ వేపోరబ్ తక్షణమే ఉపశమనాన్ని కలుగజేస్తుంది...**
**మీ బిడ్డ సులభంగా శ్వాస పీల్చుకొనుటకు సహాయపడుతుంది...**
**రాత్రంతా సుఖంగా నిద్రిస్తాడు**

మీ బిడ్డ మంచి-చెడ్డలను చూడవలసిన బాధ్యత మీది. అందు చేత బిడ్డకు జలుబు నొప్పులు వచ్చినప్పుడు, ముక్కునుండి నీరు కారుట, కండ్లనుండి నీరుకారుట, గొంతు బొంగురు పోవుట, శ్రమతో శ్వాస పీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనుపించిన వెంటనే విక్స్ వేపోరబ్‌ను పులమండి.

మీ బిడ్డ జలుబుకు విక్స్ వేపోరబ్ అత్యుత్తమమైన నివారిణి ఎందుచేతనంటే ఇది జలుబు బాధిత భాగములన్నింటిలో, ఎచ్చట జలుబు ఎక్కువగా బాధిస్తుందో, అనగా, ముక్కు, గొంతు, ఛాతీలలో చాలా గుణకరంగా పనిచేస్తుంది. మీ బిడ్డ యొక్క మృదువైన చర్మానికి ఇది చాలా మంచిది.

విక్స్ వేపోరబ్‌ను పులిమి, ఉన్ని బట్టతో కప్పి, మీ బిడ్డను సుఖంగా పరుండబెట్టండి. రాత్రంతా మీ బిడ్డ సుఖంగా నిద్రించే సమయములో విక్స్ వేపోరబ్ దాని ప్రభావాన్ని కొనసాగిస్తూ వుంటుంది. ఉదయానికల్లా అతి చెడ్డ జలుబు కూడా పూర్తిగా పోయి, మీరు అమితంగా ప్రేమించే మీ గారాబు బిడ్డ సంతోషంగా మేలుకొంటాడు.




# విక్స్ వేపోరబ్

3 సైజులలో

V V 464.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.



తాజా టీ
పరిమళమైన టీ
ఉత్తమ టీ

# టాటా-ఫిన్లే టీ

*సాటిలేని టీ!*

* తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

* అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

* టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** *టీ త్రాగండి; ఆనందము అందుకోండి!*



ఈ క్రింది రకాలలోను,
ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే
టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్, లలిత్ లీఫ్ టీ,
మిలాప్ లీఫ్ టీ, బహదూర్ డస్ట్ టీ,
షాన్ డస్ట్ టీ





# ప్రశ్నోత్తరాలు

1. *జి. వెంకటేశ్వరరావు, రాజరంగపూరు*

అన్నయ్యా, దీపావళి ప్రత్యేక సంచిక అట్టచివరి బొమ్మ చిత్రకారు లెవరు ?

అట్ట మీదా, అట్ట చివరా కలిపి ఒకే బొమ్మ. చిత్రకారులు శ్రీ వడ్డాది పాపయ్య.

2. *కె. వెంకటేశ్వర్లు, గంగవరం*

అన్నయ్యా, భారత చరిత్ర [నవంబరు]లో రాణి కర్ణావతి పై బహదూర్ షా దండెత్తి రాగా, హుమయూన్ కర్ణావతి ప్రార్థనను త్రోసిపుచ్చి, రాజపుత్రుల వినాశనాన్ని చూస్తున్నట్లు రచించారు. కాని నేను ఒక పుస్తకములో హుమయూన్, రాణి కర్ణావతి పంపిన రక్షను చేతికందుకొని ఆమెను తన చెల్లివలే భావించుకొని బహదూర్ షాను తరిమివేశెనని చదివితిని. ఏది నిజం ?

భారత చరిత్రలోది నిజం. రెండవది కట్టుకథలాగా కనిపిస్తుంది.

3. *కడలి వెంకటేశ్వరరావు, కాకినాడ*

మామా, ప్రచురించిన కథ లన్నిటికి ఒకే విధముగా డబ్బు పంపెదరా, లేక కథను బట్టి పంపెదరా ?

కథను బట్టి.

4. *ఏ. యస్. మాధవరావు, తిరుపతి*

అన్నయ్యా, రామాయణం [నవంబరు]లో మీరు గరుత్మంతుడు వచ్చి రామ లక్ష్మణులను బంధవిముక్తులను చేసెను అని వ్రాసినారు. కాని నేను లక్ష్మణుని హనుమంతుడు సంజీవ మొక్కచే బ్రతికించినట్లు విన్నాను.

కొంచెం ఓపికపడితే యుద్ధకాండలో ఆ ఘట్టం కూడా వస్తుంది.

5. *గొల్లపల్లి పట్టాభిరామశర్మ, దుద్దెడ*

మామా, ప్రపంచపు వింతలు [అక్టోబరు]లో కాంచనజంగ అని ప్రకటించిరి... ఇంతకూ కాంచనజంగనా ? లేక కాంచనగంగ శిఖరమా ?

కాంచనగంగ కాదు.

6. *అలపాటి వెంకటమోహనగుప్త, విజయవాడ*

అన్నయ్యా, నాలుగు నెలలు ఒకే వ్యక్తివి "ఫోటో వ్యాఖ్యలు" కరెక్టు అయిన అతనికి నాలుగు నెలలు డబ్బు పంపెదరా ?

ఫోటో వ్యాఖ్యలు "కరెక్టు" కావటమంటూ లేదు. వచ్చిన వ్యాఖ్యలలో ఉత్తమమైనదానికి బహుమానం ఇస్తున్నాం. ఒకసారి బహుమానం పొందినవారు తిరిగి పొందగూడదన్న నియమం ఏమీ లేదు.

7. *షేక్ అన్వర్ బాషా, అయిరాల*

మామా, "ప్రపంచపు వింతలు"కు బొమ్మలు చిత్రకారులు వర్ణనను బట్టి వూహించి వేస్తున్నారా? లేక ఫోటోలను చూచి వేస్తున్నారా?

ఫోటోలను చూసే వేస్తున్నారు.

8. *సిహెచ్. నరహరి, ఖమ్మం*

ఏమండీ, సీరియల్ కథలు మీరే వ్రాయుదురా? లేక ఇతరులు వ్రాయుదురా?

సీరియల్ కథలు మా ఆఫీసులోనే తయారవుతాయి.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మానవుడు చంద్ర లోకానికి వెళ్ళే ప్రయత్నంలో మరొక మెట్టు ఎక్కాడు. అక్టోబరు 12 న "వస్ఖోద్" (సూర్యోదయం) అనే పేరు గల అంతరిక్ష నౌక ఒకేసారి ముగ్గురు మనుషులను తీసుకుని ఆకాశంలోకి వెళ్ళిపోయి ఒక రోజల్లా భూమి చుట్టూ 16 సార్లు తిరిగి, విమానం దిగినట్టుగా నేలపై వాలింది. ఇది భావి అంతరిక్షయానాలకు నమూనా అనటానికి వీలున్నది. గ్రహాంతర యానాలు త్వరలోనే చూడగలం.

సంపుటి 35 - డిసెంబర్ '64 - సంచిక 6

CHITRA



# భారత చరిత్ర




పానిపట్టు వద్దా, గోగ్రా వద్దా బాబరుకు ఓడిపోయినప్పటికీ అఫ్ఘాన్ నాయకులు పూర్తిగా నిహతులు కాలేదు. తగిన నాయకుడే ఉంటే, కొత్తగా స్థాపితమైన మొగలు పరిపాలనను ప్రతిఘటించటానికి వారు పరవళ్ళు తొక్కుతున్నారు. షేర్ ఖాన్ సూర్ అనే వాడు వారికి తగిన నాయకుడుగా లభించాడు. అతని నాయకత్వం కింద అఫ్ఘానులు మొగలుల ఆధిపత్యాన్ని తాత్కాలికంగా తుడిచిపెట్టి, కొద్దికాలం పాటు తమ ఆధిపత్యాన్ని పునఃప్రతిష్ఠించుకో గలిగారు కూడా.

షేర్ ఖాన్ సూర్ కథ బాబర్, అక్బర్ల అద్భుత కథలకు తీసిపోయేది కాదు. అతను ఫరిద్ అనే పేరుతో అతి సామాన్యమైన జీవితం ప్రారంభించి, అష్టకష్టాలూ పడి, స్వప్రతిభతో పైకి వచ్చాడు. అతను సూర్ తెగకు చెందిన అఫ్ఘాను వాడు. అతని తాత ఇబ్రాహీమ్, తన కొడుకైన హసనును వెంటబెట్టుకుని పెషావరు ప్రాంతం నుంచి తూర్పుగా ప్రయాణం చేసి, బాజ్వార పరగణాలో సైనికవృత్తి చేసుకుంటూ స్థిరపడ్డాడు. అక్కడే 1472 లో ఫరిద్ జన్మించి ఉండవచ్చు.

కొంత కాలానికి ఇబ్రాహీమ్‌కు ఢిల్లీ జిల్లాలో ఉద్యోగమయింది. అతని కొడుకు హసన్, జౌన్పుర్ గవర్నరు వద్ద ఒక జాగీరు సంపాదించుకున్నాడు. హసన్‌కు ఇతర భార్యలున్నారు. ఫరిద్ సవతితల్లి హసన్‌ను తన చెప్పు చేతలలో ఉంచుకున్నందు వల్ల, ఫరిద్ తన 22వ ఏట ఇల్లు విడిచి జౌన్పురు వెళ్ళాడు. అప్పటి నుంచీ అతని జీవితంలో సంఘర్షణ ఆరంభమయింది. అందులో రాటు తేలి అతను మహా వీరుడయాడు. కష్టపడి చదువుకుని పర్షియన్ భాషా వాఙ్మయాలలో పారంగతుడయాడు.

## 39. అఫ్ఘానుల పునర్విజృంభణ

అతను సైన్యంలో హెచ్చు భాగం తన పక్షం చేసుకుని, సర్వస్వతంత్రుడయాడు.

చునార్ పాలకుడైన తాజ్‌ఖాన్ తన చిన్న భార్య అయిన లద్‌మాలికతో హెచ్చు ప్రేమగా ఉంటున్నాడని అతని పెద్దకొడుకు తండ్రిని హత్య చేశాడు. అయితే వైధవ్యం ప్రాప్తించిన లద్‌మాలిక షేర్‌ఖాన్‌ను పెళ్ళాడి, చునార్ దుర్గాన్ని అతనికి ఇచ్చేసింది. 1531 లో హుమాయూన్ పై అఫ్ఘానులు తిరుగుబాటు చేశారు. అప్పటికి ఆ తిరుగుబాటుతో షేర్‌ఖాన్‌కు ఏమీ సంబంధం లేదు. హుమాయూన్ చునార్ దుర్గాన్ని ముట్టడించాడు. షేర్‌ఖాన్ లొంగిపోయి ఆత్మరక్షణ చేసుకున్నాడు.

తమ పై షేర్‌ఖాన్ పెత్తనం నానాటికీ పెరుగుతూండటం సహించలేక లోహనీ అఫ్ఘానులూ, జలాల్‌ఖాన్ సైతం అతన్ని నిర్మూలింప యత్నించారు. షేర్ ఖాన్ ఈ ప్రయత్నాన్ని భగ్నంచేశాడు. ఆ మీదట వారు, 1533 సెప్టెంబరులో, బెంగాలు రాజైన మహమ్మద్ షాను ఆశ్రయించారు. బిహారు నగరానికి తూర్పున సురజ్‌గర్ వద్ద షేర్‌ఖాన్ బెంగాలు సుల్తానునూ, లోహనీలనూ ఓడించాడు. ఈ విజయం షేర్‌ఖాన్ జీవితంలో ఒక పెద్ద సోపానమయింది.

హుమాయూన్ గుజరాతు రాజైన బహదుర్ షా పైకి దండెత్తిపోయిన అదనులో షేర్‌ఖాన్ అకస్మికంగా బెంగాలు రాజధాని గౌర్ వద్ద ప్రత్యక్షమయాడు. బెంగాలు సుల్తాను మహమ్మద్ షా దుర్బలుడు; అతను షేర్‌ఖాన్‌కు 13 లక్షల బంగారు నాణాల విలువ గల పరిహారమూ, మూడు వేల చదరపుమైళ్ళ లోపు గల ప్రాంతమూ ఇచ్చుకుని సంధి చేసుకున్నాడు. ఇందు వల్ల షేర్‌ఖాన్ బలమూ, ప్రతిష్ఠా పెరిగాయి. గుజరాతు పాలకుడు బహదుర్ షా దియూకు పారిపోయాక, అనేక అఫ్ఘాన్ నాయకప్రముఖులు షేర్‌ఖాన్ పక్షమయారు.



# నేహ్రూ కథ

## 6



జవాహర్ లండనులో రెండేళ్ళున్నాడు. డబ్బు ధారాళంగా ఖర్చు పెడుతూ, సుఖమయమైన జీవితం గడిపాడు. ఇంటి నుంచి తండ్రి ఎంత ధారాళంగా డబ్బు పంపేవాడో అంత కన్న ధారాళంగా దాన్ని ఖర్చు చేసేవాడు జవాహర్. తన కొడుకు "చెడిపోతున్నా"డని మోతీలాలుకు భయంగా ఉండేది. కాని జవాహర్ చెడిపోలేదు; కొద్ది కాలం బ్రిటిషు ధనికవర్గం వాళ్ళ దుబారా పద్ధతులను అనుకరించి చూశాడు; త్వరలోనే అతనికి ఆ రకం జీవితం పైన మొహం మొత్తింది.

కేంబ్రిజ్ చదువు పూర్తి అయాక జవాహర్‌కు ఒక జల గండం తప్పింది. అతను ఒకసారి నార్వే వెళ్ళాడు. అతనూ, అతని అనుచరులూ కొండల మీద తిరగటానికి వెళ్ళి, బడలి హోటలుకు చేరుకున్నారు. హోటలులో స్నానాలకు ఏర్పాట్లు లేవు. తువాళ్ళూ అవీ తీసుకుని జవాహర్ మరొక ఇంగ్లీషు యువకుడితో సహా ఆ దాపులలో ఉన్న కొండ వాగులో స్నానం చెయ్యటానికి వెళ్ళాడు. నీటిలో దిగేటప్పుడు జవాహర్ కాలు జారింది. మంచులాగున్న ఆ నీటిలో అతని శరీరం కొయ్యబారిపోయి, చెయ్యీ కాలూ ఆడలేదు. అతి వేగంగా ఉన్న ప్రవాహం వెంబడి అతను కొట్టుకు పోసాగాడు. అతని వెంట ఉన్న ఆంగ్ల యువకుడు ఒడ్డు వెంబడి పరిగెత్తి, ఎలాగో జవాహర్ కాలు చిక్కించుకుని బయటికి లాగాడు.

అప్పటికీ జవాహర్ ఎలాటి గండం తప్పించుకున్నాడో అతనికి తెలిసిందికాదు. అతని కాలు జారిన చోటికి ఒక ఫర్లాంగు దిగువన ఒక జలపాతం ఉన్నదనీ, అది చాలా ఎత్తయినదనీ తెలిసినప్పుడు ఆ సంగతి తెలిసివచ్చింది.



జవాహర్ ఇంగ్లండులో మొత్తం ఏడేళ్ళు గడిపి 1912 ఆఖరులో స్వదేశానికి తిరిగి వచ్చాడు. దేశంలోని రాజకీయోద్యమ మంతా మితవాదుల చేతుల్లో ఉన్నది. అతి వాదులకు నాయకుడైన తిలక్ జైలులో ఉండి "గీతా రహస్యం" రాసుకుంటున్నాడు. బీహారు రాష్ట్రంలోని బంకీపూర్‌లో 1912 క్రిస్మస్‌లో కాంగ్రెసు సమావేశం జరిగింది. దానికి జవాహర్ డెలిగేటుగా వెళ్ళాడు. ఆ కాంగ్రెసు వాతావరణం చూసి అతను నిర్ఘాంత పోయాడు. సమావేశంలో పాల్గొన్న వారందరూ "ఇంగ్లీషు నేర్చిన పై తరగతి" వాళ్ళు. సమావేశం కూడా రాజకీయ సమావేశంగా కాక "సోషల్" సమావేశంగా కనిపించింది. వారి మధ్య గోఖలే ఎంతో ఉన్నతుడుగా కనిపించాడు. గోఖలే మితవాదే అయినప్పటికీ, రాజకీయ, పౌర సమస్యలను గురించి అయన కుండిన గాఢ సంతాపం జవాహరును చాలా ఆకర్షించింది.

జవాహర్ హైకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించాడు. న్యాయవాది వృత్తి కొంత కాలం పాటు సరదాగానే ఉందిగాని ఆ తరవాత విసుగు పుట్టించింది. నిజానికి జవాహర్ ఆ వృత్తికి తగినవాడు కాడు. ఇతర ప్లీడర్లనూ, వారి అభిప్రాయాలనూ, సంభాషణలనూ వింటున్నకొద్దీ అతనికి వారిపైన అసహ్యం పుట్టుకొచ్చింది.

అతనికి కావలిసిన రాజకీయాలు కూడా దేశంలో లేవు. అతని దృష్టిలో రాజకీయాలంటే ప్రజలు చైతన్యంతో కదలటమూ, పర ప్రభుత్వంతో సంఘర్షణ పడటమూ, ప్రతిఘటనా. కాంగ్రెసు బొత్తిగా నిర్జీవంగా ఉండి పోయింది. అయినా అతను కాంగ్రెసులో చేరి, ఏదన్నా తీవ్ర సమస్య లేర్పడినప్పుడు ఉత్సాహంతో పని చేసేవాడు.

అతను వేట ద్వారా కొంత ఉత్సాహం పొందుదామని కూడా ప్రయత్నించాడు.

కాని అందులో కూడా అతని కంత సరదా కలగలేదు. అడవిలోకి వెళ్ళటం పరకూ సరదాగానే ఉండేదిగాని, చంపటంలో ఆసక్తి ఉండేది కాదు. ఒకసారి కాశ్మీరులో వేటాడుతూ ఒక ఎలుగుబంటిని చంపాడు. మరొకసారి ఒక జింక దెబ్బతిని, అతని కాళ్ళ దగ్గిర పడి, కన్నీరు కారే పెద్ద కళ్ళతో అతని కేసి చూసింది. జవాహర్ ఆ కళ్ళను మరిచిపోలేక పోయాడు—వేటకు స్వస్తి చెప్పేశాడు.



1905 లో గోఖలే పూనాలో సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ స్థాపించాడు. అందులో సభ్యులుగా చేరేవారు దారిద్ర్యాన్ని ఆరాధిస్తూ దేశసేవ చేస్తామని ప్రమాణం చెయ్యాలి. ఈ సంస్థ యొక్క ఆశయాలు జవాహరును ఆకర్షించాయి గాని అతనందులో సభ్యుడుగా చేరలేదు.

ఈ సమయంలోనే జవాహర్ మొట్ట మొదటగా గాంధీని గురించి విన్నాడు. 1913 నవంబరులో గాంధీ దక్షిణ ఆఫ్రికాలో 2,500 మంది భారతీయ శ్రామికుల చేత తన నాయకత్వం కింద సత్యాగ్రహం చేయించి ఘన విజయం సాధించాడు. రాజకీయ చైతన్యంలో ఈ కొత్త పద్ధతితో పేదలూ, అజ్ఞానులూ, పీడితులూ అయినవారు విజయం సాధించటం జవాహరును చాలా ఆకర్షించింది. అతనికి ఏ విధమైన చైతన్యమైనా ఇష్టమే.

మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం ఇటలీ నిష్కారణంగా టర్కీ పైన దాడి చేసి కొన్ని ప్రాంతాలు ఆక్రమించుకున్నది. బాల్కన్ యుద్ధాలు సాగాయి. అందులో గ్రీసూ, బల్గేరియా, సెర్బియా మొదలైన దేశాలు టర్కీ పై తలపడ్డాయి. టర్కీ ప్రాచ్యదేశమనీ, మిగిలినవి పాశ్చాత్య దేశాలనీ భావం ఉండటం చేత భారతీయుల సానుభూతి టర్కీ పక్షాన ఉండింది. అది అలా ఉండగా భారతదేశంలోని ముస్లిము



17

లకు టర్కీ సుల్తాను ఖలీఫా. క్షతగాత్రులైన టర్కీ సైనికులకు చికిత్స చెయ్యటానికి వెళ్ళిన వైద్యబృందంలో భారతీయ జాతీయ వాది డాక్టరు ఎం. ఎ. అన్సారీ కూడా ఉన్నాడు. ఆయనను జవాహర్ **1905** లో లండనులో మొదటిసారి కలుసుకున్నాడు.

ఆగస్టు **1914** లో తొలి ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. అది ఎక్కడో జరుగుతూ ఉండటం చేత దాని 'సెగ' భారత దేశానికి సోకలేదు. రాజకీయ చైతన్యం పూర్తిగా అణగారి పోయింది. పైకి అందరూ బ్రిటను గెలవాలనే అరిచినప్పటికీ, మిత వాదులు సైతం జర్మనీ పట్ల కొంత సాను భూతి కలిగి ఉంటూ వచ్చారు. అది జర్మనీ పై ప్రేమ ఉండి కాదు; భారతదేశాన్ని నిర్బంధంలో ఉంచిన బ్రిటిషువారికి జర్మనీ చేతిలో పరాభవం జరిగితే తద్వారా కొంత సంతృప్తి పొందుదామనే. జర్మనీ గెలవాలని కోరటానికి మరొక అల్పకారణ మేమంటే ప్రపంచ యుద్ధంలో టర్కీదేశం జర్మనీ పక్ష మయింది.

యుద్ధం రెండో సంవత్సరంలో భారత దేశంలో కుట్రలు సాగినట్టూ, కాల్పులు జరిగినట్టూ, బ్రిటిషు అధికారులు పంజాబులో దౌర్జన్యంగా సైనిక సమీకరణ చేస్తున్నట్టూ వార్తలు వచ్చాయి. పది లక్షల మందికి పైగా భారతీయులు యుద్ధ చర్యలకు గాను నియోగించబడ్డారు. దేశ రక్షణ చట్ట నియమాల ననుసరించి సరి అయిన వార్తలు దాచి పెట్టటం చేత వెర్రి పుకార్లు వ్యాప్తిలోకి వచ్చాయి.

ఈ వాతావరణంలో జాతీయ భావాలు తిరిగి తల ఎత్తాయి. **1914** జూన్ **17** న తిలక్ జైలు నుంచి విడుదల అయాడు. తరవాత ఒక సంవత్సరానికి "గీతా రహస్యం" అచ్చయి, చురుకుగా అమ్ముడయింది. గీతలోని కర్మయోగాన్ని రాజకీయ చైతన్యపరంగా తిలక్ వ్యాఖ్యానించాడు.






## 7

[దుర్గంలోకి ప్రవేశించిన పఠాను యోధుడు కతలూఖాన్ సేనాపతి అయిన ఉస్మాన్‌ఖాన్. విమల జగతసింహుణ్ణి తిలోత్తమ గదికి చేర్చి, పైకి వెళ్ళేసరికి ఉస్మాన్‌ఖాన్ ఆమెను పట్టుకుని, ఆమె వద్ద ఉన్న తాళపు చెవులు తీసుకుని, ఆమెను బంధించి ఒక సైనికుడి కాపలాలో ఉంచి, రహస్య ద్వారంకుండా కొంతమంది పఠానులను దుర్గంలోకి ప్రవేశ పెట్టాడు. విమల తనకు కాపలావున్న పఠాను సైనికుణ్ణి మోసగించి, తప్పించుకు పోయింది.]

శత్రువులు కోటలో ప్రవేశించిన సంగతి వీరేంద్రసింహుడికి తెలియబరచటం తన ప్రథమ కర్తవ్యం గనుక విమల ఆయన శయన మందిరం దిక్కుగా పరిగెత్తసాగింది. మధ్య దారిలో ఆమెకు "అల్లా హెూ అక్బర్!" అన్న నినాదం వినిపించింది. అది పఠానుల విజయ నినాదం.

క్రమంగా దుర్గంలో కలకలం జాస్తి కాసాగింది. నిద్రపోతున్న వారంతా లేచి నట్టున్నారు. ఆమె కంగారు పడుతూ వీరేంద్రసింహుడి శయన మందిరం కేసి వెళ్ళింది. అక్కడ కోలాహలంగా ఉన్నది. పఠాను సైనికులు తలుపు పగలగొట్టి లోపల ప్రవేశించారు. వీరేంద్రసింహుడు చేత కత్తి పట్టి, వెర్రివాడిలాగా గిరగిరా తిప్పుతున్నాడు. ఆయన శరీరమంతటా రక్త ప్రవాహాలు. చివర కతని పోరాటం వ్యర్థమైపోయింది. ఒక పఠానువాడి నిడుపైన కత్తి దెబ్బతో

బంకించంద్ర చట్టోపాధ్యాయ



అసంభవమని గ్రహించి విమల వెనక్కి తిరిగింది. తిలోత్తమా జగతసింహుల కీ ప్రమాద వార్త ఎలా చేర్చాలో ఆమెకు తోచలేదు.

ఈ విషయమే ఆలోచిస్తూ ఆమె ఒక గదిలో కూర్చున్నది. అంతలోనే కొంత మంది పఠాను సైనికులు ఒక్కొక్క గదే దోచుకుంటూ తానున్న గది కేసి వస్తున్నట్టు ఆమెకు పొడకట్టింది. వారి నుంచి తప్పించుకునే మార్గం లేక ఆమె ఒక పెట్టె వెనక నక్కి దాక్కున్నది.

సైనికులా గదిలో ప్రవేశించి అందులో ఉన్న వస్తువులన్నీ సంగ్రహించ నారంభించారు. వారా పెట్టె తెరవటానికి వచ్చి తప్పక తనను చూస్తారు. అయినా విమల ధైర్యం కోల్పోక, పఠానుల చర్య లన్నిటినీ పెట్టె వెనుక నుంచి శ్రద్ధగా గమనిస్తున్నది. సైనికులు తాము సంగ్రహించిన వస్తువులను చూసుకుని మురిసిపోతూ, ఉబ్బి తబ్బిబ్బవుతున్న అదను చూసుకుని విమల పెట్టె వెనక నుంచి లేచి బయటికి జారుకున్నది.

ఆమె గది నుంచి బయటికి వచ్చిందో లేదో, వెనకపాటున ఎవడో ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఆమె వెనక్కి తిరిగి చూస్తే, రహీమ్‌శేఖ్!

వీరేంద్రసింహుడి కత్తి ఎగిరి, కింద పడిపోయింది. మరుక్షణం అతను పఠానులకు బందీగా చిక్కిపోయాడు.

విమల ఇదంతా కళ్ళారా చూసి హతాశురాలైపోయి, "ఇప్పటికైనా మించి పోలేదు. తిలోత్తమను కాపాడవచ్చు," అనుకుని, తిలోత్తమ గది కేసి పరిగెత్తింది. కాని తిలోత్తమ గదిని చేరుకోవటం ఆమెకు సాధ్యం కాలేదు. అంతటా పఠానులు పోరాడుతున్నారు. దుర్గాన్ని దోపిడీ చేస్తున్నారు. దుర్గం పఠానుల కైవసమయినట్టు స్పష్టమయింది. పఠానుల చేతిలో పడకుండా తిలోత్తమ గదిని చేరుకోవటం

"ఇప్పు డెలా తప్పించుకు పారి పోతావు?" అన్నాడు రహీమ్.

జాణ అయిన విమల ఒక్క క్షణం ఆలో చించి, "మాట్లాడకు! నోరు మూసుకుని నా వెంట రా!" అంటూ రహీమ్ చెయ్యి పట్టుకుని బయటికి లాక్కు పోయింది. రహీమ్ సమ్మతంగానే ఆమె వెంట వెళ్ళాడు.

విమల అతన్ని ఏకాంత స్థలానికి తీసుకు పోయి, "ఛీ, ఛీ! నువ్విలా చేస్తావని నే నెన్నడూ అనుకోలేదు! నన్ను ఒంటిగా పైన విడిచి ఎక్కడికి పోయావు? నీ కోసం వెతుకుతూ కోట అంతా తిరగలేక చచ్చాను," అన్నది. ఈ మాట అంటూ ఆమె అతని కేసి చూసిన చూపులకు శేఖ్ చిత్తయిపోయాడు.

"నేనేం చెయ్యను? సేనాపతిగారి కోసం తెగ వెతికాను. ఆయన అందరనుకుని పైకి వస్తే నువు లేవు," అన్నాడు రహీమ్‌శేఖ్.

"నువ్వెంతకూ రాకపోయే సరికి నన్ను మరిచిపోయావనుకుని నిన్ను వెతు క్కుంటూ బయలుదేరాను. ఇంకా నయం, కనిపించావు? హమ్మయ్య, బతికిపోయాను! శేఖ్, ఇంక ఆలస్యం చెయ్యకు. దుర్గం చిక్కిపోయినట్టే. ఇద్దరమూ పారి పోదాం పద," అన్నది విమల.




"ఇవాళ కాదు. రేప్పొద్దున పోదాం. యజమానితో చెప్పకుండా ఎలా పోవటం?" అన్నాడు రహీమ్.

"అయితే పద, ఇప్పటి నుంచే నగా నట్రా, డబ్బూ దసకమూ అంతా మూట గట్టుకుని జాగ్రత్త పెట్టుకోవాలి. లేకపోతే ఏ సైనికుడో కాజేస్తాడు," అన్నది విమల.

"పద," అన్నాడు రహీమ్.

తాను కనీసం ఇతర సైనికుల చేతిలో పడకుండానైనా రహీమ్ కాపాడతాడని ఆమె ఉద్దేశం. ఆమె శంకించినట్టే వాళ్ళకు అనేక మంది సైనికులు తగిలారు, కాని రహీమ్‌ను చూసి వారు ఏమీ చేయలేదు. వాళ్ళల్లో



కొందరు రహీమ్ అదృష్టాన్ని గొప్పగా అభినందించారుకూడా.

విమల రహీమ్ నొక గదికి తీసుకు పోయింది. అక్కడ ఎన్నో పెట్టెలూ, రక రకాల విలువైన వస్తువులూ ఉన్నాయి. "దీనిపైదే నా పడక గది. ఇక్కడ నీకేమేం కావాలో ఏరుకుని మూట గట్టుకుంటూ ఉండు. నేను పైకి వెళ్ళి, నా వస్తువులు తీసుకుని ఇప్పుడే వస్తాను, సరేనా?" అన్నదామె, తాళపు చెవుల గుత్తి ఒకటి రహీమ్ కేసి విసురుతూ.

గదిలో ఉన్న వస్తువులు చూస్తుంటే రహీమ్ కళ్ళు చెదిరిపోయాయి. అతను వేగంగా పెట్టెలన్నీ తెరవటంలో నిమగ్నుడై పోయాడు. విమల ద్రోహం చేస్తుందన్న శంక అతనిలో కలగనేలేదు. ఆమె బయటికి వెళ్ళి తలుపులు మూసి తాళం వేసేసింది. రహీమ్ ఖైదీ అయిపోయాడు.

విమల తిలోత్తమ గది కేసి పరిగెత్తింది. అది దుర్గానికి ఒక మూలలో ఉన్నది. దానికి దిగువనే నది ప్రవహిస్తున్నది. అప్పటికింకా సైనిక విద్రోహు లెవరూ అటుగా రాలేదు. దుర్గంలో చెలరేగే కోలాహలం తిలోత్తమా జగతసింహులకు వినిపించిందో లేదో కూడానూ. విమల ఒక్కసారిగా తిలోత్తమ గదిలోకి ప్రవేశించక, తలుపు సందుకుండా లోపలికి చూసింది. తిలోత్తమ మంచం మీద కూర్చుని ఉన్నది. జగతసింహుడు పక్కనే నిలబడి ఆమె ముఖంలోకి చూస్తున్నాడు. తిలోత్తమ కంట నీరు పెట్టుకుంటున్నది, జగతసింహు డామె కన్నీరు తుడుస్తున్నాడు. అవి వీడ్కోలు అశ్రువులని విమల కనిపించింది.

విమల లోపలికి వస్తుండగానే జగతసింహుడు, "బయట ఆ కోలాహలమేమిటి?" అని అడిగాడు.

"పఠానుల విజయధ్వానాలు. వాళ్ళు ఏ క్షణానైనా ఇక్కడికి రావచ్చు. మీరు

త్వరగా ఏదో ఒక మార్గం ఆలోచించండి," అన్నది విమల.

"వీరేంద్రసింహు డెక్కడ?"

"శత్రువులకు చిక్కిపోయారు."

ఈ మాట వింటూనే తిలోత్తమ కెవ్వన అరిచి, స్పృహతప్పి శయ్యపై పడిపోయింది. జగతసింహుడి ముఖం నిస్తేజమయింది. అతను విమలతో, "నీవు తిలోత్తమ సంగతి చూడు," అన్నాడు.

విమల పన్నీరు బుడ్డీ తీసుకుని తిలోత్తమ ముఖం పైన చల్లి, విసరసాగింది. పఠానుల కోలాహలం ఇప్పుడు దగ్గరలో వినిపిస్తున్నది. విమల అశ్రుకంఠంతో, "వచ్చేస్తున్నారు! వచ్చేస్తున్నారు! ఏం కానున్నది, యువరాజా? ఏం కానున్నది?" అన్నది.

జగతసింహుడు కళ్ళ నిప్పులు రాల్చుతూ, "ఒంటరిగాణ్ణి ఏం చెయ్యగలను? నీ సఖిని రక్షించటానికి నా ప్రాణాలు ధారపోస్తాను," అన్నాడు. శత్రువుల కోలాహలమూ, కత్తి కటార్ల చప్పుళ్ళూ మరింత సమీపంగా వినిపిస్తున్నాయి. విమల గట్టిగా, "తిలోత్తమా, ఇలాటి సంకట సమయంలో స్పృహ తప్పి పోతివే, నిన్నెలా కాపాడేటట్టు?" అన్నది.

తిలోత్తమ కళ్ళు తెరిచింది.

"యువరాజా, తిలోత్తమకు స్పృహ వచ్చింది," అన్నది విమల.



"ఈ ఇంట్లో ఉండగా ఆమె నెవరూ కాపాడలేరు. తిలోత్తమ బయటికి రాగల స్థితిలో ఉన్నట్టయితే నేను మిమ్మల్ని బయటికి చేర్చగలిగి ఉందును, కాని ఆమెలో అంత శక్తి లేదు. శత్రువులు వచ్చి పడుతున్నారు. విమలా, నేను నా ప్రాణాలనైతే అర్పించగలను గాని, తిలోత్తమను రక్షించలేనందుకు విచారిస్తున్నాను," అన్నాడు జగతసింహుడు.

విమల తిలోత్తమను చప్పున ఎత్తుకుని, "అయితే పదండి. నేను తిలోత్తమతో సహా మీ వెనకే వస్తాను," అన్నది. వాళ్ళు గది దాటి వచ్చే సరికల్లా పఠాను సైనికు లెదురై, "అల్లాహొ అక్బర్!" అని కేకలు పెట్టారు. వారు జగతసింహుడి పై లంఘించారు.

ఒక్క క్షణంలో జగతసింహుడు తన కరవాలంతో ఒక సైనికుడి గుండెల్లో పొడిచాడు. ఆ సైనికు డొక చావు కేక పెట్టి పడిపోయాడు. వాడి గుండెలో గుచ్చుకున్న కత్తిని తీసేలోపుగా మరొక సైనికుడు జగతసింహుడి మెడకు గురిచేసి బల్లెం విసిరాడు. జగతసింహుడు మెరుపులాటి వేగంతో దాన్ని పట్టుకుని ఆ సైనికుడి పైన ఎంత బలంగా విసిరాడంటే, వాడా క్షణంలోనే ప్రాణాలు విడిచాడు. మిగిలిన ఇద్దరు పఠానులూ ఒకే సారి తమ కత్తులను అతనిపై విసిరారు.





రెప్పపాటులో అతను ఒక కత్తిని తన కరవాలంతో పడగొట్ట గలిగాడు. కాని రెండవది అతని భుజానికి తగిలి గాయం చేసింది. ఆ దెబ్బ తగులుతూనే అతను గాయపడిన సింహం లాగా అయిపోయి, తనను గాయపరిచిన వాణ్ణి ఒక్క వేటున చంపేశాడు. ఈలోపుగా దెబ్బతిన్న పఠానువా డొకడు ఎడమ చేత్తో ఒక బాకు విసిరాడు. అది జగతసింహుడి ఛాతీకి తగిలింది. అయితే అతని కది సూది గుచ్చుకున్నట్టు కూడా లేదు. అతనా సైనికుడి నడుము పైన బలంగా తన్నే సరికి వా డంత దూరాన వెళ్ళి పడ్డాడు. జగతసింహుడు తన కత్తితో వాడి తల నరికెయ్య బోయేలోగా, "అల్లాహో అక్బర్!" అంటూ అనేక మంది పఠాను సైనికు లక్కడికి వచ్చారు.

ఇంక పోరాటమంటే చావేనని అతను తెలుసుకున్నాడు. అతని శరీరమంతా రక్తంతో తడిసి ఉన్నది.

తిలోత్తమ ఇంకా విమల చేతుల్లోనే స్పృహతప్పి ఉన్నది. విమల ఏడుస్తున్నది. జగతసింహుడి రక్తంతో ఆమె చీరె కూడా తడిసిపోయింది.

గది అంతా పఠాను సైనికులతో నిండిపోయింది. జగతసింహుడు కత్తిని నేలపై




మోపి, దీర్ఘంగా నిట్టూర్చి, కొద్దిగా తూలసాగాడు. ఒక్కసారిగా చాలా రక్తం పోవటం చేత అతనికి నీరసం వచ్చేసి, కళ్ళు మూసుకు పోతున్నాయి.

ఆ సమయంలో ఒక సైనికుడు, "ఒరే, తొత్తూ! కత్తి కింద పడెయ్యరా, నీ ప్రాణాలు తియ్యం!" అన్నాడు.

ఈ మాటలు వింటూనే జగతసింహుడు, ఆరే నిప్పుపై ఆజ్యం పోసినట్టయిపోయి, ఒక్క కత్తి వేటుతో ఆ మాట అన్నవాడి తల నరికేశాడు. వాడి పైన పాదం పెట్టి, "రాజపుత్రుడు తన ప్రాణాల నెలా విసర్జిస్తాడో చూడండి!" అని గర్జించాడు.

మళ్ళీ సైనికులు కత్తులు ఝళిపించారు. తాను ఒంటరిగా పోరాటం సాగించటం సాధ్యం కాదని జగతసింహుడు గ్రహించాడు. సాధ్యమైనంత మంది పఠానులను చంపి ప్రాణాలు వదులుదా మనుకున్నాడు. అతను స్పృహతప్పి పడిపోతూ ఈ మాటలు విన్నాడు:

"కబడ్దార్! రాజకుమారుడి ప్రాణాలు తీయవద్దు! సింహాన్ని మర్యాదగా ప్రాణాలతో పట్టుకుని బోనులో ఉంచవలిసి ఉన్నది," అ మాట లన్నది ఉస్మాన్‌ఖాన్.

ఉస్మాన్‌ఖానూ, అతని సైనికు డొకడూ కలిసి జగతసింహుణ్ణి ఎత్తి శయ్యపై పడుకో బెట్టారు. జగతసింహుడి ప్రియురాలైన తిలోత్తమ శయ్యే అతనికి మరణశయ్య అయే పరిస్థితి ఏర్పడింది.

ఉస్మాన్‌ఖానుకు గది లోపల స్త్రీలిద్దరూ కనిపించలేదు. "ఆ స్త్రీ లేమయారు?" అని అత నడిగాడు.

జరిగిన దేమిటంటే, రెండో దఫా కత్తుల యుద్ధం సాగగానే, విమల జరుగనున్నది గ్రహించి, తిలోత్తమతో సహా ఒక పెద్ద పెట్టె వెనక నక్కి దాక్కున్నది. ఆమె కంతకంటె ఉపాయం కనిపించలేదు.

ఉస్మాన్‌ఖాన్ వారిని కానక, తన సైనికులతో, "వాళ్ళెక్కడ ఉన్నారో వెతకండి. కోట అంతా గాలించండి. దాసీది మహా చురుకైనది. అది తప్పించుకు పోగూడదు. అందువల్ల మనకు భయమున్నది. వీరేంద్ర సింహుడి కుమార్తె పై మాత్రం ఎలాటి అత్యాచారమూ జరగటానికి వీల్లేదు, జాగ్రత్త!" అన్నాడు.

ఆ సమయంలో ఒక సైనికుడు పెట్టె పైగా తొంగిచూసి, "వాళ్ళిక్కడే ఉన్నారు, హుజూర్!" అన్నాడు.

ఉస్మాన్‌ఖాన్ ముఖం వికసించింది. "బయటికి వచ్చేయండి. భయమే మీ లేదు," అన్నాడతను. —(ఇంకా వుంది)





# ఆగ్రహించిన దేవత

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి రాసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, ఏ దేవతను తృప్తి పరచటానికి గాను నీవీ నిశిరాత్రివేళ ఈ విధంగా శ్రమపడుతున్నావో నాకు తెలి యదు గాని, దేవతలను తృప్తి పరచటం మానవులకు సాధ్యమైన పని కాదు. ఒక్కొక్కసారి మానవులు చూపే భక్తి వాళ్ళకు ఆగ్రహం కూడా తెప్పిస్తుంది. ఇందుకు తార్కాణంగా నీకు చెప్పులు కుట్టే మల్లడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

ఒకప్పుడు నరకంలో యమకింకరులు ఒక పాపిని ముళ్ళ మీదుగా నడిపించి, కాళ్ళూ, చేతులూ విరిచి కట్టి కాలిన ఇసుక దిబ్బ మీద పడేసి వెళ్ళిపోయారు. పాపి బాధకు తట్టుకోలేక గట్టిగా ఏడుస్తున్నాడు.

## బేతాళ కథలు



అప్పుడు ఆకాశమార్గాన వెళుతున్న ఒక దేవతాస్త్రీ వాడి ఆక్రందన విని, జాలిపడి, వాడున్న చోటికి దిగి వచ్చి, వాడి కాళ్ళలో గుచ్చుకున్న ముళ్ళన్నీ తీసేసి, వాడి బాధ కొంత తగ్గించి, తన దారిన తాను స్వర్గానికి వెళ్ళిపోయింది.

అయితే, నరకంలో ఒక పాపి కాళ్ళు తాకినందున ఆమె చేతి వేళ్ళకు నరక మలినం అంటుకున్నది. ఎంత ప్రయత్నించినా అది పోలేదు. ఆమె వేళ్ళ కంటుకున్న మాలిన్యాన్ని గురించి దేవతా స్త్రీ లందరికీ త్వరలోనే తెలిసిపోయింది. చివరకు ఆ సంగతి దేవేంద్రుడి దాకా వెళ్ళింది.

దేవేంద్రు డామెను పిలిపించి, ఆమె వేళ్ళు పరీక్షించి, "ఈ నరక మాలిన్యం నీ కెలా సోకింది?" అని అడిగాడు.

ఆమె జరిగిన సంగతంతా దేవేంద్రుడికి చెప్పింది.

అంతా విని దేవేంద్రుడు, "దేవతవై ఉండి నీవు నరకానికి వెళ్ళటమే తప్పు. అక్కడ ఒక పాపి తాను చేసిన పాపాలకు శిక్ష పొందుతూంటే నీవు జోక్యం కలిగించుకోవటం మరింత తప్పు. ఈ నరక మాలిన్యం వదిలిన దాకా నీవు భూలోకంలోకి వెళ్ళి అక్కడ చెప్పులు కుట్టుతూ ఉండు. నీ తప్పు కదే శిక్ష!" అన్నాడు.

దేవత తన మాలిన్యం సాధ్యమైనంత త్వరలో వదిలేటట్టు అనుగ్రహించమన్నది.

"ఒక వెయ్యి జతల చెప్పులు కుట్టేసరికి నీ మాలిన్యం దానంతట అదే పోతుంది," అన్నాడు దేవేంద్రుడు.

దేవత భూలోకానికి వచ్చేసి ఒక చెప్పులు కుట్టే వాణ్ణి ఎన్నుకుని, రాత్రివేళ వాడికి కొన్ని జతల చెప్పులు కుట్టి తెల్లవారే సరికల్లా సిద్ధంగా ఉంచింది.

ఆ చెప్పులు కుట్టేవాడు చాలా సత్పురుషుడు, దైవభక్తి గలవాడు. అందుకే ఆమె వాణ్ణి ఎన్నుకున్నది. కాని వాడు చాలా పేద

వాడు. వాడు కుట్టే చెప్పులు మోటుగా ఉండేవి. ధనికులు ధరించే చెప్పులు కుట్టటం వాడికి చేతకాదు. దేవత వాడికి చాలా నాజూకైన చెప్పులు కుట్టి ఇచ్చింది.

మర్నాడు ఉదయం వాడా చెప్పులు చూసుకుని తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. అవి ఎవరు కుట్టారో, ఎలా వచ్చాయో వాడికి తెలియదు. కాని అవి మటుకు తాను సిద్ధం చేసి ఉంచుకున్న తోలుతో కుట్టినవే. వాడా చెప్పులను అమ్ము కుందామని నగరంలోకి వెళ్ళాడు. అవన్నీ అతి శీఘ్రంగా అమ్ముడయాయి. డబ్బు కూడా బాగా వచ్చింది. అందులో తన అవసరానికి కొద్దిగా ఉంచుకుని మిగిలినది పెట్టి మేలైన తోళ్ళు కొనుక్కుని, వాడు ఇంటికి తిరిగి వచ్చాడు.

ఆ రాత్రి దేవత వాడు తెచ్చిన తోళ్ళ నన్నిటినీ ఎంతో అందమైన చెప్పుల జతల కింద మార్చేసింది.

ఏ దేవతో తనకు సహాయ పడుతున్నట్టు చెప్పులు కుట్టేవాడికి అర్థమయింది. ఆరోజు కారోజు వాడు హెచ్చు డబ్బు సంపాది స్తున్నాడు. పెద్ద మొత్తాలలో తోళ్ళు కొంటు న్నాడు. ఎంత తోలు కొన్నా అంతా మర్నాటి కల్లా దివ్యమైన పాదరక్షలుగా తయారై సిద్ధంగా ఉంటున్నది.



కొద్ది రోజుల్లోనే వాడు సుఖంగా బతికే స్థితికి వచ్చాడు. వాడి చెప్పులకు మంచి గిరాకీ, మంచి పేరుకూడా వచ్చింది. తనకు సహాయం చేస్తున్న దేవత పట్ల వాడికి భక్తి పొంగి పొర్లసాగింది. ఆ దేవత కోసం వాడు రాత్రివేళ పూజాద్రవ్యాలూ, గంధమూ, పుష్పాలూ, తాంబూలమూ, ధూపమూ, దీపారాధనా ఉంచసాగాడు.

చెప్పులైతే మామూలు ప్రకారం తయారవుతూనే ఉన్నాయి గానీ, తనపై ఇంత అనుగ్రహం గల ఆ దేవత తాను సమర్పించే వస్తువులలో ఒక్కటీ తాకలేదు. దేవత ఆరగింపు కోసం ఫలాలు మొదలైనవి నైవేద్యం ఉంచాడు. వాటినీ దేవత తాకలేదు. ఒక నాడు కొత్త బట్ట కొని తాంబూలంతో సహా దేవతకు అర్పించాడు. దేవత తీసుకోలేదు. ఒకరోజు పళ్ళెంలో కొన్ని రూపాయలు పోసి ఉంచాడు. మర్నాడు ఉదయం, పోసిన రూపాయలు పళ్ళెంలో పోసినట్టుగానే ఉన్నాయి.

చెప్పులు కుట్టేవాడు ఆ దేవతను ప్రార్థించాడు, "ఓ దేవతా, నీ వల్ల ఎంతో లాభం పొందుతున్నాను. అందుకు కృతజ్ఞతగా నే నిచ్చేది ఏదీ ముట్టవెందుకు? నా మీద ఎంతో దయ లేకపోతే ప్రతి రాత్రీ నా కోసం చెప్పులు తయారు చేస్తావా? నేను భక్తితో



ఇస్తున్న వాటిలో కనీసం ఒక పుష్పమో, ఫలమో స్వీకరించి నాకు ఆనందం చేకూర్చు! నీవు నా నుంచి ఏదో ఒకటి తీసుకుని అనుగ్రహించిన దాకా నా మనస్సుకు శాంతి ఉండదు!" అంటూ వాడు రోజూ దేవతను ప్రార్థించసాగాడు.

చెప్పులు కుట్టేవాడు చేసేదంతా దేవత గమనిస్తూనే ఉంది. వాడి భక్తిశ్రద్ధల కామె తనలో తాను నవ్వుకున్నది. కాని వాడు ప్రార్థనలు మొదలుపెట్టాక ఆమె సహించలేకపోయింది. రెండు మూడు రోజులు ప్రార్థించి, విసిగి, వాడే మానేస్తాడేమో నని ఆమె అనుకున్నది. కాని ఆ రోజు కారోజు వాడి ఆరాటం జాస్తి అవుతున్నది. వాడి ప్రార్థనలు దేవతను కలవరపరచ సాగాయి.

ఆ బాధ పడలేక దేవత వాడి ఇల్లు వదిలేసి మరొక ధనికుడైన చెప్పులు కుట్టేవాడి ఇంటిని ఆశ్రయించింది. ఆమె చేతి మాలిన్యం చాలావరకు పోయింది. ఇంకా కొద్ది వందల చెప్పుల జతలు మాత్రమే కుట్టవలిసి ఉన్నది. ఈ రెండో చెప్పులు కుట్టేవాడింట చెప్పులు కుట్టే తోళ్ళు గుట్టలు గుట్టలుగా ఉన్నాయి. ఒక్క రాత్రిలో దేవత వాటన్నిటినీ చెప్పుల జతల కింద మార్చేసి, తన నరక మాలిన్యం పూర్తిగా పోగొట్టుకుని, స్వర్గానికి వెళ్ళి పోయింది.



ఇక్కడ మొదటి చెప్పులు కుట్టేవాడు, దేవత తనను విసర్జించి పోయినట్టు తెలుసు కున్నాడు. తాను కొన్న తోళ్ళు చెప్పులుగా మారటం నిలిచిపోయింది. దేవత తనపై ఆగ్రహించింది. తన వల్ల ఏమి అపచారం జరిగినదీ వాడికి తెలియదు. వాడా దిగులుతో మంచం పట్టి తీసుకుని, కొంత కాలానికి చనిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. బీదవాడై నప్పటికీ, సత్పురుషుడనే కదా దేవత మొదటి చెప్పులు కుట్టేవాణ్ణి ఎన్నుకుని వాడిపై అనుగ్రహించింది? మంచి వాళ్ళకు దైవభక్తి ఉండటం సహజం. తమ భక్తుల కోరికలు తీర్చటం దేవతలకు కూడా సహజమే. అటువంటప్పుడు దేవత వాడు సమర్పించిన కానుకలలో ఏ ఒకటీ ముట్టక, వాణ్ణి అసంతృప్తి పరచటానికీ, వాడి న్యాయమైన కోరిక తీర్చక నిరుత్సాహ పరచటానికీ ఏమిటి కారణం? ఈ సందేహానికి జవాబు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దేవత కోరినది చెప్పులు కుట్టే వాణ్ణి అనుగ్రహించటమూ, వాడికి లాభం చేకూర్చటమూ కాదు; తన మాలిన్యాన్ని పోగొట్టుకొనటం. తాను కుట్టిన చెప్పులతో మంచివాడు బాగుపడితే ఆమె కేమీ అభ్యంతరం లేదు. కాని చెప్పులు కుట్టేవాడు మూఢుడై దేవతకే ప్రత్యుపకారం చేయబోయాడు. వాడిచ్చిన వస్తువులలో దేన్ని తాకినా, నరక మాలిన్యం పోయేలోపుగా భూలోక మాలిన్యం అంటుకుంటుందేమో నని దేవత భయపడింది. చెప్పులు కుట్టేవాడి కోరికను దేవత అందుకే తీర్చలేదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# తగిన గురువు

పూర్వం భార్గవుడనే గ్రామాధికారికి లేకలేక పుట్టిన ఒకే ఒక కొడుకు దీపకుడు. కొడుక్కి మంచి విద్యాబుద్ధులు చెప్పించి ప్రవీణుడుగా చేయాలని తండ్రి కోరిక. అయితే సమర్థుడైన గురువు ఎక్కడ దొరుకుతాడా అని ఆలోచనలో పడ్డాడు భార్గవుడు.

దీపకుడు చాలా చురుకైనవాడు, తెలివైనవాడు. ఏ విషయమైనా ఒక్కసారి వింటే పట్టుకుంటాడు. వయసుకు మించిన ప్రశ్నలు ఎన్నో వేస్తూంటాడు. వాటికి జవాబు చెప్పాలంటే తండ్రికీ చేతకాదు, మరెవరికీ సాధ్యంకాదు. ఇంత గ్రహణశక్తి గల బాలుడికి విద్య చెప్పే గురువు సామాన్యుడైతే లాభంలేదు. కనుకనే భార్గవుడు కష్టపడి తగిన గుపవు కోసం వెతక వలసి వచ్చింది. తన గ్రామంలోనే ఒక గురుకులం వుంది. కాని ఆది పసివాడి బుద్ధిబలం వృద్ధి చేయ గలది కాదు.

అక్కడికి రెండామడ దూరంలో శిలాపీఠమనే ఊరిలో కర్మఠీయుడనే వృద్ధుడి గురుకుల ముంది. ఆయన శిష్యులందరూ ప్రతిభావంతులై పేరు పొందుతున్నారని చాలామంది చెప్పారు. కాని భార్గవుడికి సందేహం పట్టుకుంది.

అంత గొప్ప గురువైతే గ్రామంలో ఎందుకు పడివుంటాడు? అటువంటి వాడి పోషణకు గ్రామస్థులంతా పోగుచేసి ఏపాటి ఇవ్వగలరు? గొప్పవాడే అయితే బస్తీ చేరుకుని బోలెడంత సంపాదించడా? పోనీ, నగరానికి తీసుకుపోయి అక్కడి గురుకులంలో పిల్లవాడిని వదులుదామంటే, ఎడబాటుకు సహించడం కష్టమనుకున్నాడు భార్గవుడు.

ఏమైనా కానీ, ఇంతమంది చెప్పే విషయాన్ని నిర్లక్ష్యం చేసి ఊరుకోవటం భావ్యం కాదు. ఒకసారి చూసి వస్తే పోయేది లేదు

ఎం. నాగభూషణం



కదా అని తలిచి, ఒకనాడు భార్గవుడు మంచిది చూచుకుని, కానుకలు చేత పట్టుకుని, కొడుకును వెంట బెట్టుకు బయల్దేరాడు. చీకటిపడే వేళకు ఆ గురుకులం చేరుకున్నాడు.

భార్గవుడు చేరుకునే సరికి కర్మఠీయుడు దగ్గరలో చెరువుకు స్నానానికి వెళ్ళి ఉన్నాడు. ఇంట్లో వున్న ఆయన భార్యా, బిడ్డలూ అతిథుల్ని చక్కగా ఆదరించారు.

తనుకూడా చెరువుకు వెళతానని కుతూహలపడ్డాడు భార్గవుడు. గురువుగారి పెద్ద కొడుకూ, ఆరేళ్ళ మనవడూ ఆయన్ని చెరువుకు తీసుకు పోయారు. వీళ్ళు వెళ్ళేటప్పటికి బట్ట లుతుకుతూ కనిపించిన కర్మఠీయుడికి భార్గవుడు నమస్కరించాడు.

క్షేమాదికాలైన తరువాత, "గురూత్తమా! ముఖ్యమైన రెండు రంగుల్లోనూ మీకు రెండోదే చాలా ముఖ్యమా?" అని అడిగాడు భార్గవుడు.

"రెండూ చాలా ముఖ్యమే. ఇది లేకపోతే అది లేదు, అది లేకపోతే ఇది లేదు" అంటూ గురువు జవాబు చెప్పాడు.

పక్కనే వున్న గురువుగారి మనవణ్ణి చూచి భార్గవుడు, "అబ్బాయీ!—మా మాటలు నీకు అర్థమైనాయా?" అన్నాడు.

అందుకా పిల్లవాడు, "అర్థం కాకేం? 'పగటికన్నా రాత్రే మీకు చాలా ముఖ్యమా?' అని మా తాతయ్యను మీ రడిగారు. 'రెండూ ముఖ్యమే' నన్నారు తాతయ్య" అని చెప్పాడు.

తరవాత భార్గవుడు, "నిండు పన్నెండూ ఉండగా, మీ వంటి వృద్ధులు ఆరోవంతులో బాధపడట మెందుకు స్వామీ?" అని మళ్ళీ ఆయన్ని ప్రశ్నించాడు.

అందుకు కర్మఠీయుడు, "నేను పుట్టిన తరవాత, చచ్చీ మళ్ళీ పుట్టిన ముప్పయి రెండు సంతతు లింకా బతికే వున్నాయి. అందుకే," అని బదులు చెప్పాడు.

ఈ సంభాషణలో భావ మేమిటని భార్గవు డీసారి గురు పుత్రుణ్ణి అడిగాడు. అందు కతడు ఇలా చెప్పాడు; "మీరు మా నాన్న గారిని 'శిశిర ఋతువైన ఈ చలిలో ఎందుకు కష్టపడతారీ వృద్ధాప్యంలో!' అని ప్రశ్న వేశారు. దానికి మా తండ్రి 'నాకు పళ్ళన్నీ దృఢంగావుండి జీర్ణశక్తికి తోడ్పడుతున్నాయి. కనుకనే ఈ శీతలాన్ని భరించే శక్తి నాకున్నది' అని బదులిచ్చారు." అన్నాడు.

తరవాత భార్గవుడు మళ్ళీ కర్మఠీయుణ్ణి ఉద్దేశించి, "అయ్యా, తరుచు ఇళ్ళు కడుతూ పడగొడుతూండే వాళ్ళు ఎందరున్నా రండీ?" అని అడిగాడు.

దానికి గురువు, "అటువంటి పని చేసి చేసి, మానుకున్నవాళ్ళు నలుగురు. ఇప్పుడు వాళ్ళ తరఫువాళ్ళు ఆ పని చేస్తున్నారు," అంటూ జవాబు చెప్పాడు.

ఈ ప్రశ్నకు కూడా గురువుగారి కొడుకే వివరణ చెప్పాడు: "'మీ యింట్లో చిన్న పిల్ల లెంతమంది?' అని ప్రశ్న. అందుకు మా నాన్నగారు, 'నాకు నలుగురు కొడుకులు, చాలామంది మనమలూ అని సూచించారు," అన్నాడు.

మళ్ళీ భార్గవుడు, "స్వామీ!—మీరు తరుచుగా కాంతికన్యను తెస్తూవుంటారను



కొంటాను. నా మాట నిజమేనా?" అని అడిగాడు.

ఈ మాటకు గురువు, "లేదు, కాంతి కన్యను తెస్తే వస్త్రభూషణ లిచ్చి మళ్ళీ మర్యాదగా సాగనంపాలికద? కనుక మా స్వంత కన్యనే ఎప్పటికీ నమ్ముకుని వుంటాం. అదే మాకు పదివేలు," అని జవాబు చెప్పాడు.

గురు కుమారుడు దీని అర్థం ఇలా చెప్పాడు: "'అప్పుగా ధనం తెచ్చుకుం టారా?' అని మీ ప్రశ్న, 'లేదు, స్వంత సంపాదనతోనే కాలక్షేపం చేస్తున్నా' మని నాన్నగారి జవాబు".

ఇంతటితో ఊరుకోలేదు, భార్గవుడు. "కల్పవృక్షాన్ని ఆశ్రయించాలి గాని, కేవలం ఒక చీపురు పుల్లను ఆధారం చేసుకోవటం భావ్యమా?" అని అడిగాడు.

దీనికి సూక్ష్మంగా, "కల్పవృక్షం లేక చీపురుపుల్ల మాత్రం ఎలా వస్తుంది? చీపురు పుల్లలు కూడితేనే పరిశుభ్రత వస్తుంది. పరిశుభ్రతే లక్ష్మీప్రదం" అన్నాడు కర్మఠీయుడు.

ఈ సమస్యను గురించిన వివరణ ఇలా చెప్పాడు గురువుగారి కొడుకు: "రాజాశ్రయం లేక గ్రామం ఉండదు. నేనే గ్రామాన్ని అలక్ష్యం చేస్తే బాగుచేసే దెవరు? గ్రామస్థు లందరూ విద్యావంతులై, ఏకీభావంగా వుంటే గ్రామం అభివృద్ధి పొందుతుంది. గ్రామంలో తెలివిమంతులకు రాజాశ్రయం కలగవచ్చు" అని, మీ ప్రశ్నకు నాన్నగారి జవాబు." ఇలా సంభాషణ జరుగుతూండగా గురువుగారి మూడేళ్ళ మనవరాలు గబగబ చెరువుకు పరుగెత్తుకు వచ్చింది. వస్తూనే తాతకు ఊపిరాడకుండా ప్రశ్నల వర్షం కురిపించసాగింది.

ఆ పాపను చూచి ఎంతో ముచ్చటపడిన భార్గవుడు, "అమ్మాయీ, నే నొక చిన్న ప్రశ్న వేస్తా జవాబు చెప్పు మరి, చూదాం," అన్నాడు.

"అడగండి మరీ" అంది పిల్ల.

"మౌనంగావుండాలంటే ఏంచెయ్యాలి?" అని అడిగాడు భార్గవుడు.

తడుముకోకుండా ఒక్క గుక్కలో "అల్లరి చెయ్యాలి" అనేసి, గిరుక్కుమని తిరిగి ఇంటికి పారిపోయింది పిల్ల.

అందరూ నవ్వుకున్నారు. భార్గవుడు ఆశ్చర్యపోయాడు. మనసులో మరెట్టి సంశయమూ లేకుండా ఆయన తన కొడుకును కర్మఠీయుడి గురుకులంలోనే చేర్పించాడు. కాలక్రమాన దీపకుడు గొప్ప విద్వాంసుడై, కులదీపకుడై తండ్రికి మంచి కీర్తి తెచ్చాడు.





# పెట్టని పరీక్ష

దేశంలోని గ్రామాధికారు లందరికీ రాజు గారి వద్ద నుంచి ఒక ఫర్మానా వచ్చింది. అదేమిటంటే, ప్రతి గ్రామాధికారీ తన గ్రామంలో ఉండే విశిష్ట వ్యక్తుల పేర్లూ, వివరాల్లూ రహస్యంగా రాజుగారి దివాణానికి అందజేయాలి. గ్రామంలో ఉండే పండితులూ, కవులూ, గాయకులూ, శిల్పులూ, వీరులూ మొదలైన వారి పేర్లను జాబితాలో చేర్చవచ్చు.

రాజుగారి ఫర్మానా చేత బట్టుకుని దివాణం నుంచి ఒక అధికారి ప్రతి గ్రామమూ తిరుగుతూ పాపన్న ఉండే గ్రామంలోని గ్రామాధికారి వద్దకు కూడా వచ్చాడు. గ్రామాధికారి తమ గ్రామంలో ఉన్న ఒక కవీ, ఒక శిల్పీ, ఒక గాయకుడూ, ఇద్దరు వీరులూ—వీరి పేర్లను జాబితాలో వేసి, ఆఖరున ఆరో పేరు కింద పరోపకారి పాపన్న పేరు కూడా చేర్చాడు.

అధికారి జాబితా తీసుకుని వెళ్ళి పోయిన వారం రోజులకు గ్రామాధికారికి దివాణం నుంచి ఒక తాఖీదు వచ్చింది; జాబితాలో చేర్చిన ఆరుగురికీ గ్రామాధికారి నిరూపణ పత్రాలిచ్చి, వచ్చే నవమి మధ్యాహ్నం లోపుగా వారిని ఆస్థానానికి పంపాలి.

గ్రామాధికారి ఆరుగురినీ పిలిపించి, రాజుగారి తాఖీదు వినిపించి, "మీ కందరికీ రాజుగా రేదో సన్మానం చేసేటట్టు కనబడుతుంది. కనక మీరందరూ బయలుదేరి వెళ్ళండి," అన్నాడు.

"వాళ్ళంతా ప్రత్యేకతలు గల వాళ్ళు. నన్నెందుకు పొమ్మంటారు, స్వామీ? నేను ఎందులోనూ ప్రముఖుణ్ణి కానే! నామూలంగా గ్రామానికి అప్రతిష్ట వస్తుందో ఏమో!" అన్నాడు పాపన్న.

"అదేమీ ఉండదు. నిన్ను గురించి నిజం తెలుసుకునే రాజుగారు ఆహ్వానిం



చారు. ఆహ్వానాన్ని తిరస్కరించటం నేరమవుతుంది. వెళ్ళిరా," అన్నాడు గ్రామాధికారి. పాపన్న విధిలేక ఒప్పుకున్నాడు.

గ్రామం నుంచి రాజధానికి నాలుగు రోజుల ప్రయాణం. ఆరుగురూ వీలును బట్టి మజిలీలు చేస్తూ, నవమినాటి ఉదయానికి రాజధాని సమీపాన గల గ్రామానికి చేరుకున్నారు. అవాంతరాలు రాకుండా ఉంటే మధ్యాహ్నం లోపల రాజుగారి ఇంటికి చేరుకోవచ్చు.

వాళ్ళు కొంత దూరం వచ్చేసరికి ఒక కాలవ అడ్డొచ్చింది. కాలవను దాటటానికి ఒక తాటి బొంతు గట్లకు అడ్డంగా వేసి ఉన్నది. వాళ్ళక్కడికి వచ్చేసరికి, దాని మీదుగా దాటటం చేతగాక ఒక ముసలిదీ ముగ్గురు పిల్లలూ చిక్కన పడి ఉన్నారు.

అటుగా వచ్చిన ఆరుగురినీ చూసి ముసలిది, "బాబూ, నన్నూ, ఈ పసి వాళ్ళనూ అవతలికి దాటింతురూ! తాటి బొండు మీదుగా నడవటానికి భయంగా ఉన్నది. కాలవ చూడబోతే లోతు," అన్నది.

పాపన్న ముఠాలో వాళ్ళు, "వెనక నుంచి ఇంకెవరైనా వచ్చి దాటిస్తారులే. మేం తొందరగా వెళ్ళాలి," అంటూ ఒకరొకరే తాటిబొండు మీదుగా కాలవ దాటి అవతలికి వెళ్ళారు. ఒక్క పాపన్న మటుకు ఇవతలే ఉండిపోయి, "నిన్నూ, నీ పిల్లలనూ నేను దాటిస్తాలే, భయపడకు," అన్నాడు.

కాస్త ఆలోచించిన మీదట అది కూడా అంత తేలికపని కాదని పాపన్నకు తోచింది. ముసలిది మరీ వృద్ధు, పిల్లలు మరీ పసి వాళ్ళు. ఆ తాటి బొండు మీదుగా ఆ ముసలి దాన్నీ, ఆ పసి పిల్లలనూ చెయ్యి పట్టి నడిపించటం అంత తేలిక పనికాదు. మధ్య దారిలో వాళ్ళు తనను కూడా నీటిలో పడెయ్యవచ్చు. అందుచేత పాపన్న కాలవ మీదుగా పట్టుతాడు ఏర్పాటు చేయ నిశ్చ

యించాడు. తాను స్వయంగా ఒక రిద్దరిని నడిపించి ప్రయోజన మేమిటి? పట్టుతాడు ఏర్పాటు చేస్తే ప్రతి ఒక్కరూ దాని సహాయంతో తాటిబొండు మీదుగా దాట గలుగుతారు. ఈ మాట అనుకుని పాపన్న తన మూట ఒడ్డున పెట్టి, అక్కడ పాతటానికి గుంజకర్ర కోసం వెతకసాగాడు.

అప్పటికే అవతలి ఒడ్డుకు చేరిన అయిదుగురూ, "పాపన్నా, రావేం? ఇంకా ఏం చేస్తున్నా వక్కడ? పొద్దెక్కి పోతున్నది!" అని కేకలు పెట్టారు.

"మీరు నడుస్తూండండి. నేను వచ్చి కలుసుకుంటాను," అన్నాడు పాపన్న.

"వీ డెప్పుడూ ఇంతేలే. ఇంత దూరం మనతో కలిసి వచ్చాడు, అదే విశేషం," అనుకుని మిగతా అయిదుగురూ గబగబా ముందుకు సాగారు.

కాలవ దగ్గిర దిగబడి పోయిన పాపన్న ఆరేసి అడుగుల నిడుపు గల రెండు కర్రలు గట్టివి సంపాదించి, కాలవ ఈ ఒడ్డునా, ఆ ఒడ్డునా బాగా లోతుగా, గట్టిగా పాతాడు. బలమైన మర్రిఊడలు తెచ్చి, వాటిని తాడుగా అమర్చి, రెండు గుంజలకూ కట్టాడు. ఇప్పుడెంత పిరికి వాళ్ళయినా ఆ తాడు పట్టుకుని తాటి బొండు మీదుగా కాలవను దాటి వెళ్ళవచ్చు.





పరికరాలేవీ లేని కారణంచేత ఈ పని పూర్తి కావటానికి రెండు మూడు గడియలు పట్టింది. ముసలిదీ, దాని మనమలూ చివరకు కాలవ దాటారు.

"బతికించావు, బాబూ. ఇంక మేం దివాణానికి నిశ్చింతగా పోవచ్చు," అన్నది ముసలిది.

"మీరు రాజుగా రింటికా పోతున్నారు?" అన్నాడు పాపన్న ఆశ్చర్యంతో.

"అవును, నాయనా. రాజుగారి పుట్టిన రోజు పండుగ కదా! బీద సాదలకు అన్నాలు పెడుతున్నారు. దానికే నా మనవళ్ళతో సహా పోతున్నా," అన్నది ముసలిది.

"నేనూ అక్కడికే పోతున్నా. అందరమూ కలిసే పోదాం," అన్నాడు పాపన్న.

అయితే నడక చురుకుగా సాగలేదు. అందరి కన్న చిన్న పిల్లవాడు కాళ్ళు నొప్పి పెడుతున్నాయనీ, నడవలేననీ అన్నాడు. ముసలిది వాణ్ణెత్తుకుని బొత్తిగా నడవలేక పోయింది. అందుచేత పాపన్న వాణ్ణి తానే ఎత్తుకుని నడిచాడు.

పాపన్న దివాణానికి చేరుకునే సరికి మధ్యాహ్నం కొంచెం దాటనే దాటింది. పాపన్న భోజనశాల దగ్గిర ముసలిదాన్నీ, పిల్లలనూ వదిలి, అతిథులు ప్రవేశించే ద్వారం వద్దకు వెళ్ళాడు.

అతనితో వచ్చిన అయిదుగురూ మధ్యాహ్నానికి ముందే చేరుకున్నప్పటికీ వారికి ప్రవేశం దొరకలేదు. వారింకా బయటే ఉన్నారు. మంత్రిగారు వాళ్ళనడిగి, ఫలాని గ్రామం నుంచి వస్తున్నట్టు తెలుసుకుని, "జాబితా ప్రకారం మీరు ఆరుగురు కద. ఆరోవాడేడి?" అన్నాడు.

"అతను దారిలో లేనిపోని పనులేవో మీద వేసుకుని వెనకపడి పోయాడు," అన్నారు వాళ్ళు.

"అతన్ని కూడా రానివ్వండి. అందరూ లోపలికి పోవచ్చు," అన్నాడు మంత్రి.

పాపన్న కనిపించగానే వాళ్ళయిదుగురూ అతని పైన విరుచుకు పడ్డారు. "నీ మూలంగా మేం బయటే ఉండి పోయాం. మా కన్న ఎంతో ఆలస్యంగా వచ్చిన జట్లన్నీ లోపలికి వెళ్ళి పోయాయి. నువు మన గ్రామాని కున్న పరువు కాస్తా తీసేశావు," అన్నారు వాళ్ళు.

"అందుకే నేను రాను మొర్రో అన్నాను," అన్నాడు పాపన్న.

ఆరుగురూ కలిసి మంత్రిగారి వద్దకు వెళ్ళారు. మంత్రిగారు వాళ్ళు తెచ్చిన నిరూపణ పత్రాలు పరిశీలించి, వారు ఆలస్యంగా రావటానికి కారణ మడిగాడు.

"అయ్యా, తప్పు నాదే. వీరయిదుగురూ సమయానికే వచ్చారు. ఇక్కడి కొక మైలు దూరాన కాలవ మీద పట్టుతాడు అమర్చుతూ నేనే ఆలస్యం చేశాను," అంటూ పాపన్న తాటి బొండు పైన కాలవ దాటటంలో ముసలివాళ్ళకూ పిల్లలకూ గల అసౌకర్యం గురించి చెప్పాడు. ముసలిదాన్ని గురించీ, దాని మనమలను గురించీ కూడా మంత్రి గారికి చెప్పాడు.

"ఇప్పుడా వంతెన సౌకర్యంగా ఉన్నదా?" అని మంత్రి అడిగాడు.

"చిత్తం. చిన్న పిల్లలు కూడా దాట వచ్చునండి," అన్నాడు పాపన్న.



"అది మరమ్మతు చెయ్యటాని కెంత కాలం వృధా అయింది?" అని ప్రశ్నించాడు మంత్రి.

"మేం వచ్చి చేరి మూడు ఘడియలయిందండి," అన్నారు మిగిలిన అయిదుగురు.

"ఇప్పుడు మధ్యాహ్నం దాటి ఘడియే అయింది. మీరు అయిదుగురున్నారు. మీరు కూడా అతనికి సహాయపడి ఉంటే అందరూ మధ్యాహ్నం లోపలే వచ్చి ఉండరూ?" అన్నాడు మంత్రి.

ఎవరూ జవా బివ్వలేదు.

"సరే, మీరు ముందు వెళ్ళి భోజనాలు చెయ్యండి," అన్నాడు మంత్రి.

రాజుగారి పుట్టినరోజు ఉత్సవాల సందర్భంలో మూడు రోజులపాటు సదస్సు జరిగింది. వివిధ గ్రామాల నుంచి వచ్చిన ప్రముఖులకు వారి వారి విద్యలలో పరీక్షలు పెట్టి, వారి వారి ప్రతిభకు తగ్గటుగా బహుమానా లిచ్చారు.

తనకు కూడా ఏదో పరీక్ష పెడతారనీ, తన పని అభాసవుతుందనీ పాపన్న భయపడ్డాడు, కాని అలాటి దేమీ జరగలేదు. ఆఖరు రోజు పరీక్షలు ముగిశాయి. ఒక్కొక్కరి పేరే చదివి బహుమానాలు పంచసాగారు. పాపన్నకు పరీక్ష జరగలేదు, అందుచేత అతని కేమీ బహుమానం ఉండదని, అతని వెంట వచ్చిన వాళ్ళను కున్నారు. కాని రాజుగారు పాపన్నను కూడా బహుమతి ప్రదానానికి పిలిచాడు.

"ఈయన పేరు పాపన్న. పరోపకారి. ఈయనకు పరీక్ష పెట్టలేదు. ఎందు కంటే ఈయన ఇక్కడికి వచ్చే దారిలోనే ఈయన పరీక్ష జరిగి పోయింది. ప్రతిఫలం ఏమీ కోరకుండా, తాను నష్టపడి అయినా తోటి మానవులకు ఎల్లప్పుడూ ఉపకారం చేసే పాపన్నకు పదివేల బంగారు కాసులు ప్రత్యేక బహుమానంగా ఇస్తున్నాం," అని రాజుగారు నిండు సభలో ప్రకటించాడు.





# నారదుడి శాపం

ఒకసారి నారదుడు హిమవంతుడి ఇంటికి వెళ్ళాడు. హిమవంతు డాయనకు అతిథి సత్కారాలు చేసి, "స్వామీ, నా వల్ల తమకు కావలిసిన కార్యమేదన్నా ఉంటే సెలవియ్యండి," అన్నాడు.

"నేను తపస్సు చేసుకుందా మను కుంటున్నాను. నిర్విఘ్నంగా నా తపస్సు కొనసాగే చోటేదని బ్రహ్మ నడిగితే, నీ అధీనంలో ఉన్న ప్రస్రవణపర్వతం మీద ప్రసవకందరం ఉన్నదనీ, అక్కడ ఒక బ్రహ్మాండమైన వటవృక్షం ఉన్నదనీ, అక్కడే శివుడు తపస్సు చేసి పార్వతిని సంపాదించుకున్నాడనీ, అక్కడ నా తపస్సు నిర్విఘ్నంగా సాగుతుందనీ అన్నాడు. నాకా ప్రదేశం ఇవ్వాలి," అన్నాడు నారదుడు.

హిమవంతుడు సరే నన్నాడు.

నారదుడు ప్రసవకందరంలోని వటవృక్షం కింద తపస్సు ప్రారంభించాడు. దేవేంద్రుడీ వార్త విని కంగారు పడి, నారదుడి తపస్సు భగ్నం చెయ్యటానికని రంభాది అప్సరసలను పంపాడు. అప్సరసలు ప్రసవకందరం చేరి నారదుడి సమీపంలో నృత్య గీతాలు సాగించారు. నారదుడు ఏ మాత్రమూ చలించక, అప్సరసలను చూసి నవ్వి, వారిని దేవలోకానికి వెళ్ళిపొమ్మన్నాడు. శాపం తప్పినందుకు సంతోషించి వారు వెళ్ళిపోయారు.

కొంతకాలం గడిచాక నారదుడు తపస్సు చాలించి, కైలాసానికి వెళ్ళి శివుణ్ణి చూశాడు. శివుడు నారదుణ్ణి చూసి సంతోషించి, విశేషా లేమిటని అడిగాడు.

"నీవు తపస్సు చేసిన ప్రసవకందరంలోనే నేనూ తపస్సు చేశాను. తేడా ఏమిటంటే, మన్మధుడు పార్వతి ద్వారా నిన్ను ఆకర్షించినప్పుడు నీకు ఆత్మనిగ్రహం లేకపోయింది. కోపావేశంలో

పాటీలు తిమ్మారెడ్డి




మన్మథుణ్ణి భస్మం చేశావు. కాని పార్వతిని స్వీకరించి అతనికి ఓడావు. నన్ను కూడా మన్మధుడు అప్సరసల ద్వారా చలింప జేయ జూశాడు. నేను ఆగ్రహించనూ లేదు, మన్మధుడికి లొంగిపోనూ లేదు; అప్సరసలను మంచిగా పంపేశాను," అన్నాడు నారదుడు గర్వంగా.

శివుడు కొంచెం యోచించి, "ఈ సంగతి విష్ణువుతో మాత్రం చెప్పనని మాట ఇయ్యి," అన్నాడు. నారదుడు సరేనని, శివుడి వద్ద సెలవు తీసుకుని వైకుంఠానికి వెళ్ళాడు. విష్ణుమూర్తి నారదుడికి స్వాగతం తెలిపి విశేషాలడిగాడు.

నారదుడు తన తపస్సు గురించీ, కైలాసంలో తనకూ శివుడికీ జరిగిన సంభాషణ గురించీ విష్ణువుతో చెప్పి, "ఈ విషయం మీతో చెప్పవద్దని శివుడు బతిమాలుకున్నాడు," అన్నాడు.

"అలాటప్పుడు నీవు నాకిదంతా చెప్పకుండా ఉండవలిసింది. ఈ జరిగిన సంగతంతా బ్రహ్మకు మాత్రం చెప్పకు," అన్నాడు విష్ణువు.

నారదుడు విష్ణువు వద్ద సెలవు తీసుకుని బ్రహ్మను చూడటానికి సత్యలోకానికి బయలుదేరాడు. కాని దారిలో ఏదో తారుమారు జరిగింది. అతనికి పూర్వం ఎన్నడూ తెలియని ఒక నగరం తగిలింది. తాను ఎలా దారి తప్పినదీ ఊహించలేకుండా నారదుడా నగరం ప్రవేశించాడు. అక్కడి పౌరులు నారదుడికెంతో ఆదరం చూపి, రాజు దగ్గిరికి తీసుకుపోయారు.

ఆ రాజు పేరు శీలనిధి. అతని కుమార్తె విశ్వమోహినికి మర్నాడే స్వయంవరం జరగనున్నది. రాజు తన కుమార్తెను నారదుడికి చూపి, ఆమె చేత ప్రణామం చేయించి, నారదుణ్ణి ఆశీర్వదించమన్నాడు.

విశ్వమోహినిని చూడగానే నారదుడికి మతిపోయింది. పైకి ఆమెను ఆశీర్వదించి,

నారదుడు లోలోపల ఆమె కోసం దహించుకు పోసాగాడు. ఆ పరిస్థితిలో ఏమి చెయ్యటానికీ నారదుడికి పాలు పోలేదు.

నారదుడు విష్ణువును ధ్యానించాడు. విష్ణువు ప్రత్యక్షమయాడు. నారదు డాయనకు తన సమస్య తెలుపుకుని, "ఎలాగైనా రాజకుమార్తె రేపు నన్నే వరించేలాగు అనుగ్రహించండి," అని ప్రార్థించాడు.

విష్ణువు నవ్వి, "భయపడకు. నీకు మేలు గలిగేటట్టు నేను చూస్తాను," అని అంతర్ధానమయాడు. ఇక విశ్వమోహిని తనదే ననుకున్నాడు నారదుడు.



మర్నాడు స్వయంవరం. వివిధ దేశాల నుంచి రాజకుమారులు వచ్చి, స్వయంవర మండపంలో తమ తమ యోగ్యతలకు తగిన స్థానాలలో కూర్చున్నారు. వారి మధ్య నారదుడు కూడా కూర్చుని ఉన్నాడు. విశ్వమోహిని వరమాల చేత ధరించి, చెలికత్తెలను వెంటబెట్టుకుని, ఒక్కొక్క రాజకుమారుణ్ణీ చూస్తూ వస్తున్నది.

విష్ణుప్రభావం వల్ల నారదుడు తనకు తాను ఒక రాజకుమారుడి లాగా కనిపిస్తున్నాడు, తక్కినవారికి ఒక ఋషిలాగా కనిపిస్తున్నాడు, రాజకుమార్తెకు మాత్రం కోతిలాగా కనిపిస్తున్నాడు. ఆమె నారదుడిదాకా వచ్చి, అతన్ని చూసి విరగబడి నవ్వి, ముందుకు వెళ్ళి మరొక రాజకుమారుడి మెడలో వరమాల వేసింది.

పట్టరాని ఆగ్రహంతో నారదు డక్కడి నుంచి లేచిపోయాడు. అప్పటిదాకా ఆ సభలో మారువేషాలతో ఉన్న శివకింకరు లిద్దరు, "నీ కోతి ముఖాన్ని నీటిలో చూసుకో, స్వామీ," అన్నారు. నారదుడు నీటి వద్దకు వెళ్ళి చూసుకోగా అందులో తన కోతి ముఖం స్పష్టంగా కనిపించింది.

నారదుడు కోపం పట్టలేక, "దుర్మార్గులారా, నన్ను చూసి నవ్విన మీరు రాక్షసులైపోండి. నన్ను కోతి అన్నందుకు,

కోతుల చేతిలో చావండి," అని వాళ్ళను శపించాడు. అప్పటికీ నారదుడి ఆగ్రహం చల్లారలేదు. తనకు సహాయం చెయ్యకపోగా పరాభవం చేసినందుకు విష్ణువు పై అతనికి చాలా కోపంగా ఉంది. సరిగా ఆ క్షణంలోనే విశ్వమోహినిని వెంటబెట్టుకుని విష్ణువు నారదు డున్నచోటికి వచ్చాడు.

నారదుడు విష్ణువుతో, "నీవు మొదటి నుంచీ మోసగాడవు. పాలసముద్రం చిలికి నప్పుడు విషాన్ని శివుడి కిచ్చి, లక్ష్మినీ, కౌస్తుభాన్నీ కాజేశావు. ఇప్పుడు రాజకుమారుడి వేషంలో వచ్చి ఈ రాజకుమార్తెను కాజేసి నాకు విరహం కలిగించావు. అందుకు గాను మీ రిద్దరూ నరజన్మలెత్తి భార్యా భర్తలై విరహబాధ అనుభవించండి. నన్ను కోతిని చేసినందుకు నీకా కోతులే శరణ్యమవుతాయి," అంటూ శపించాడు.

"ఆగు, నారదా, ఆగు!" అన్నాడు విష్ణువు. అంతలోనే ఆ నగరం మాయమయింది. విశ్వమోహిని స్థానంలో లక్ష్మి నిలబడి ఉన్నది.

"నారదా, మన్మథుణ్ణి జయించిన నీవు ఒక స్త్రీ కోసం ఎలా విరహం పొందావు? క్రోధాన్ని జయించినందుకు విగ్రవీగితివే! ఈ శాపాలన్నీ ఏమిటి?" అని విష్ణువు నారదుణ్ణి అడిగాడు. నారదుడు విష్ణువు కాళ్ళపై పడి క్షమాపణ వేడాడు.

"లే, నారదా! విచారించకు. లోక కల్యాణం కోసం జరగబోతున్నదే నీ నోట శాపాల రూపంగా వెలువడింది. రావణ సంహారం కోసం నేను రాజపుత్రుడుగా జన్మించి, భార్యా విరహం పొందనున్నాను. ఈ శివకింకరులు అక్షయ ప్రహస్తులనే రాక్షలుగా జన్మించి హనుమంతు డనే వానరుడి చేతిలో చావ నున్నారు. నేను వానర సహాయంతోనే రాక్షస సంహారం చేయ నున్నాను," అంటూ విష్ణువు లక్ష్మి సమేతుడై అంతర్ధానం చెందాడు.





# అపూర్వ సంఘటన

కొన్ని వందల ఏళ్ళక్రితం దేశాంతరంలో ఒక నగరంలో ఒక సంపన్ను డుండేవాడు. ఆయనకు తన భార్య పై ఎంతో ప్రేమ. ఒకనా డామెకు ఒక చిత్రమైన మూర్ఛ లాటిది వచ్చింది. మామూలుగా ఉన్న మనిషి కాస్తా ఆకస్మికంగా విరుచుకు పడి పోయి, కాళ్ళూ చేతులూ కొట్టుకుని, చివ రకు కొయ్యబారి పోయింది. శరీరం ముట్టుకు చూస్తే చల్లగా ఉంది, శ్వాస నిలిచిపోయింది. కొత్త రకం జబ్బేదో వచ్చి ఆమె చనిపోయిం దనుకున్నారు. ఆమె చనిపోయిందని వైద్యుడు కూడా అన్నాడు.

తనకు పంచప్రాణాలూ అయిన భార్య పోయినందుకా సంపన్నుడు చాలా బాధ పడ్డాడు. ఆమెను శవపేటికలో పెట్టేటప్పు డతను ఆమె చేతికి ఒక రవ్వటుంగరం పెట్టాడు. "శవానికి ఉంగరం పెట్టట మేమిటి? ఆమె ఇతర నగలతో బాటు అది కూడా పిల్లల కుంటుంది," అని బంధువులు సలహా యిచ్చారు.

"అది ఆమెకు హెచ్చుగా ఇష్టమైన ఉంగరం. నేను దాన్ని ఆమెకు శాశ్వతంగా ఇచ్చేశాను, కొన్నాళ్ళు పెట్టుకోవటానికి కాదు," అన్నాడు భర్త. ఎవరెన్ని విధాల చెప్పినా ఆయన మనసు మారలేదు.

శవపేటికను చర్చికి పట్టించుకుపోయి, అక్కడి ఆవరణలో తన భార్యను సమాధి చేయించి, పుట్టెడు దిగులుతో భర్త ఇంటికి తిరిగి వచ్చాడు.

ఉత్తరక్రియల సమయంలో శవపేటిక పైన మూత వేసేటప్పుడు శవం చేతికున్న రవ్వటుంగరం ఒక మనిషి కంటపడింది. అతను చర్చిలో శవాలను సమాధి చేసేపని చూస్తూంటాడు.

"అంత ఖరీదైన ఉంగరాన్ని భూమిలో పూడ్చిపెట్టటం అన్యాయం. అమ్మితే దానికి

బి. శేషగిరిరావు



బోలెడంత ధర వస్తుంది," అనుకున్నాడా చర్చి నౌకరు. ఈ ఆలోచన క్రమంగా ఆశగా పరిణమించి, ఆ ఉంగరాన్ని కాజెయ్యాలన్న నిర్ణయం రూపం దాల్చింది. అతను రోజల్లా ఈ విషయమే ఆలోచిస్తూ, ఆ రాత్రి చీకటిలో ఎవరికీ తెలియకుండా చర్చి ఆవరణలో జొరబడి, పై మట్టి తవ్వి, శవపేటికపై మూత తెరిచాడు.

అతని చేతిలోని లాంతరు వెలుగులో ఉంగరంలోని రవ్వ ధగధగా మెరిసింది. శవం చేతి నుంచి ఆ ఉంగరం తీద్దామని అతను తన చెయ్యి చాస్తూ ఉండగా శవం చెయ్యి కదిలి, తడువుకుంటూ పెట్టె అంచును పట్టుకున్నది. శవం పెట్టెలో నుంచి లేవటానికి ప్రయత్నిస్తున్నట్టు కనబడేసరికి ఆ దౌర్భాగ్యుడు తన చేతిలోని లాంతరు అక్కడే జారవిడిచి, కాలిసత్తువ కొద్దీ కంగారుతో పారిపోయాడు. లాంతరు కిందపడి ఆరిపోయింది.

నిజానికి సంపన్నుడి భార్యకు వచ్చినది ఒక రకమైన మూర్ఛ గాని జబ్బు కానే కాదు. చర్చి నౌకరు శవపేటికపై మూత తెరిచే సమయాని కామెకు స్ఫురణ రాసాగింది. త్వరలోనే ఆమె శవపేటికలో లేచి కూర్చున్నది. చుట్టూ చీకటి. తనకు ఏమయినదీ, తాను ఎక్కడ ఉన్నదీ ఆమెకు కొంత సేపు అంతు చిక్కలేదు. తన వంటికి శవాలకు చుట్టే గుడ్డ చుట్టి ఉండటమూ, ఎదురుగా చర్చి శిఖరం ఎత్తుగా కానరావటమూ చూసి ఆమె జరిగిన దేమిటో గ్రహించ గలిగింది.

ఆమె తనకు చుట్టి ఉన్న గుడ్డను తీసి పారేసి, లేచి నిలబడి, "నేను చచ్చిపోయాననుకుని, పాపం, నా భర్త ఎంత దుఃఖించి ఉంటాడో? పిల్లలు ఎంత కలతపడి ఉంటారో?" అనుకున్నది. ఆమెకు త్వరగా ఇంటికి వెళ్ళిపడా లనిపించింది. కాని ఆమె శరీరంలో బలం చాలా తక్కువగా ఉన్నది.

ఆమె బలవంతాన కాలు తీసి కాలు వేస్తూ చర్చి ఆవరణ దాటి రోడ్డు మీదికి వచ్చింది. ఎవరైనా సాయపడి తనను ఇంటికి చేరుస్తారేమో అనుకుంటే రోడ్డు నిర్మానుష్యంగా ఉన్నది. చలి కూడా జాస్తిగా ఉన్నది.

ఎంతో ప్రయాసతో ఆమె తన ఇంటికి చేరుకునేసరికి సింహద్వారం మూసి గడియ పెట్టి ఉన్నది. ఆమె చాలాసేపు బాదిన మీదట ఇంటి నౌకర్లలో ఒకడు లేచి వచ్చి తలుపు ఒక అంగుళం తెరిచి బయటికి చూసి, "ఎవరునువు? దుఃఖంలో మునిగి తేలుతున్న ఇంట్లో ఎవరైనా ఇట్లా తలుపులు బాదుతారా?" అన్నాడు.

"నేనేరా! మీ యజమానురాలిని. నన్ను లోపలికి రానివ్వరా, బాబూ!" అన్నదామె.

నౌకరు తన చేతి దీపం బయటపెట్టి, దాని వెలుగులో తన యజమానురాలిని గుర్తించాడు. ఆమె ముఖం పాలిపోయి ఉన్నది, కాని దయ్యంలాగా కనపడలేదు. అయినా వాడు మందమతి. పొద్దున చని పోయి, సమాధికూడా అయిపోయిన తన యజమానురాలు అర్ధ రాత్రివేళ ఎలా సజీవంగా ఉన్నదో వాడికి అర్థంకాలేదు.

"నువే ననుకో, దొరసానీ! కాని నిన్ను పాతి కూడా పెట్టారు గదా, నువెట్లా అవుతావో తెలీటంలేదే!" అన్నాడు వాడు.





"నేనేరా, నేనేరా! లోపలికి రానివ్వరా!" అని ఆమె ఆక్రోశించింది.

చివరకు వాడు తన యజమానికి సంగతంతా చెప్పి, ఆయన ఏం చెయ్యమంటే అది చేద్దామనుకున్నాడు. వాడు తలుపులు దగ్గిరిగా వేసి, మెట్లెక్కి తన యజమాని పడక గదికి పరిగెత్తాడు.

భారమైన ఆ తలుపులు చేరవేసే ఉన్నప్పటికీ వాటిని తోసే శక్తి కూడా లేక సంపన్నుడి భార్య సింహద్వారం వెలపలనే కుప్ప కూలిపోయి బలహీనంగా రోదించసాగింది. తా నింటికి వెళ్ళగానే తన భర్తా, పిల్లలూ ఆనందోత్సాహాలలో తేలిపోయి, తనకు ఘనంగా స్వాగత మిస్తారనుకున్నది గాని, ఇలా జరుగుతుందని ఆమె ఏమాత్రమూ శంకించలేదు.

నౌకరు వచ్చి కేక పెట్టేసరికి యజమాని నిద్రపోవటం లేదు. ఆయన శోక సముద్రంలో మునిగి తేలుతూ, తలుపు తట్టిన చప్పుడు కూడా వినలేదు. నౌకరు కేకవిని, "ఏమిట్రా? ఏం కావాలి?" అన్నాడు.

"అమ్మగారు వచ్చారయ్యా, లోపలికి రానీమంటున్నారు. ఏమిటి సెలవు?" అన్నాడు నౌకరు.

యజమాని పక్కమీద లేచి కూర్చుని, "ఒరే, నువ్వేమన్నా కలగంటున్నావా? లేక మతిపోయిందా?" అన్నాడు.

"నిద్రపోయాను గాని, అమ్మగారు తలుపు తట్టితే లేచాను, బాబూ. మతేమీ చెడలేదు గాని, ఏం చెయ్యాలో తెలీటం లేదు. అమ్మగార్ని లోపలికి రానిచ్చేదా?" అన్నాడు వాడు.

"పరాచకానికైనా ఇదా సమయం? ఇంత క్రూరమైన పరాచకమా?" అన్నాడు యజమాని.

"పరాచకం కాదు, బాబూ. అమ్మగారు వాకిలి దగ్గిరున్నారు. లోపలికి రానివ్వనా?" అన్నాడు వాడు మళ్ళీ.

యుజమాని మళ్ళీ పడుకుంటూ, "ఇంకే మమ్మగార్రా, పిచ్చి వెధవా? ఆవిడ వాకిలి బయటుందంటే ఎలా నమ్ముతానురా? మన గుర్రాలు మెట్లెక్కి మేడమీది కొస్తున్నాయన్నా నమ్ముతానేమో కానీ!" అన్నాడు.

నౌకరు ఒక చేత దీపం పట్టుకుని, రెండో చేత్తో బుర్ర గోక్కున్నాడు. అమ్మగారిని లోపలికి రానివ్వాలో వద్దో అయ్యగారు మొత్తం మీద చెప్పాడుకాడు!

ఇంతలో వాడికి మెట్ల మీద పెద్ద చప్పుడు వినిపించింది.

నౌకరు లాంతరు తీసుకుని మెట్ల దగ్గిరికి పరిగెత్తుకుపోయి చూసేసరికి, యుజమానికి గల రెండు తెల్ల గుర్రాలూ మెట్లెక్కి వస్తూండటం కనిపించింది.

వాడు యుజమాని దగ్గిరికి తిరిగి పోయి, "బాబూ, బాబూ! మన గుర్రాలు మెట్లెక్కి మేడ మీదికి వస్తున్నాయి!" అన్నాడు కంగారుతో.

మెట్లు కొయ్యవి. రెండు గుర్రాలు వాటి పైగా ఎక్కి వస్తుంటే అయ్యే చప్పుడంతా యింతా కాదు. యుజమాని కింకేమైనా సందేహం ఉంటే గుర్రం సకిలింపు కూడా వినిపించింది.

యుజమాని పక్కమీద నుంచి చివాలున లేచి, నౌకరు చేతి లాంతరు లాక్కుని, గబగబా కిందికి దిగి వెళ్ళాడు. సింహద్వారం బార్లా తెరిచాడు. బయట చీకట్లో మొదట ఎవరూ లేనట్టే ఉంది. సన్నని రోదనం వినపడి కిందికి చూస్తే ఆయనకు తన భార్య కుప్పకూలి ఉండటం కనబడింది.

గుండె దడదడ లాడుతూ ఆయన తన భార్యను తన చేతులలో ఎత్తుకుని లోపలికి తెచ్చి ఉపచారాలు చేశాడు. తెల్లవారే సరికల్లా ఆమె మామూలు మనిషి అయింది. ఆమె ప్రాణాలతో తిరిగి వచ్చినందుకు పిల్లలూ, బంధువులూ పొందిన ఆనందం ఇంతా అంతా కాదు.





# అతి తెలివి

ఒక వూరిలో ఒక సంస్కృత పండితు డుండే వాడు. అయనకు పుస్తక జ్ఞానమే తప్ప, లోకజ్ఞానం గాని వ్యవహారజ్ఞానం గాని లేదు. ఎవరైనా అ గ్రామానికి వచ్చి పురాణం చదువుతుంటే అందరికీ తెలిసిన పదాలకు నిఘంటువు చూసి వింత అర్థాలు చెప్పి నానా రసాభాసా చేసేవాడు.

అ పండితుడికి ఒకసారి అజీర్ణ బాధ కలిగి వైద్యు డింటికి పోయాడు. "దీనికే ముంది. కంటకారి కషాయం పెట్టించి మూడు పూటలు పుచ్చుకోండి, తగ్గిపో తుంది," అన్నాడు వైద్యుడు.

"కంటకారి కషాయమేనా! సరే, సరే, తెలిసింది," అని చెప్పి ఇంటి ముఖం పట్టాడు పండితుడు.

ఇంటికి వచ్చి అయన నిఘంటు తిరగేసి, తనలో ఇలా తర్కించుకున్నాడు: 'కంటకం' అంటే ముల్లు. ముల్లుకి అరి అంటే శత్రువు పాదరక్ష. ఇలా అనుకుని పండితుడు వెంటనే తన చెప్పు తీసి ముక్క ముక్కలు చేసి, వాటితో కషాయం కాచి సేవించాడు.

మూడు పూట లయ్యేసరికి వ్యాధి తగ్గ టానికి బదులు ఎక్కువయింది.

పండితుడు మళ్ళీ వైద్యుడి దగ్గరకు వెళ్ళి, అయన చెప్పిన మందేమీ పని చెయ్యలేదని తెలియపరిచాడు.

పండితుడు చెప్పిన మాటలు బాగా నిదా నించి, వైద్యుడు ఇలా అన్నాడు: "అయ్యో పాపం, నయంకాలేదా? ఈ మాటు ఒక పని చెయ్యండి—లంఘనం పరమౌషధం అని శాస్త్రం. దాన్ని మించింది లేదు. అలా చేయటం ఎంతవరకు సాధ్య మవుతుందో బాగా అలోచించుకుని అలా చెయ్యండి."

వైద్యుడు చెప్పిన చికిత్స బోధపడిం దన్నట్టు తల వూపి, ఇల్లు చేరుకున్నాడు పండితుడు. వెంటనే మళ్ళీ నిఘంటు తీసి

ఎస్. గోవిందయ్య

చూచాడు. 'లంఘనం' అంటే దూకుట, దాటుట అని వుంది.

"భేష్!—బలే ఘనవైద్యు డీయన. ఆ నాడు ఆంజనేయులు చేసిన మహత్కా ర్యాన్ని నాకు చికిత్సగా చెప్పాడు," అని సంతోషించాడు పండితుడు.

ఆ పండితుడుంటున్న ఇంటికి సమీపం లోనే ఒక కాలవ వున్నది. పండితుడు ధోవతి బిగించికట్టి, మనస్సులో ఆంజనే యుణ్ణి ఒకసారి ధ్యానించి, కాలవగట్టు అటు నుంచి ఇటూ, ఇటు నుంచి అటూ దూకసాగాడు.

అసలే అజీర్తి రోగం. అందులో ఆహారం నిషేధించాడు వైద్యుడు. ఈ పరిస్థితిలో కాలవ దూకటం వ్యాయామం వల్ల కొద్ది సేపటికే శోష వచ్చి పడిపోయాడు పండి తుడు. ఒంటి నిండా గాయాలు తగిలాయి.

అక్కడి జనం వెంటనే ఆ పండితుణ్ణి వైద్యుడి వద్దకు తీసుకుపోయారు. వైద్యుడు గాయాలకు కట్లు కట్టి, నీరసం తగ్గటానికి మందిచ్చే సరికి, కొంత సేపయాక పండి తుడికి తెలివి వచ్చింది.

వైద్యుడు పండితుణ్ణి లంఘనం చేస్తూ వుండికూడా, అలా కాలవగట్టు ఎందుకు దూకుతున్నావని అడిగాడు. పండితుడు తనకు నిఘంటువులో లంఘనం అన్న మాటకు కనిపించిన అర్థం చెప్పి, "మీరు చేయమన్నట్టే చేశాను," అన్నాడు.

వైద్యుడికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. మరి కాస్త ప్రశ్నించిన మీదట పండితు డాయనకు, కంటకారి కషాయం ఎలా తయారు చేసి, సేవించినది కూడా చెప్పాడు.

అప్పుడు వైద్యుడు "అయ్యా, పండిత వర్యా!—నేను చెప్పే మూలికల్ని గురించి దుకాణంలో అడగండి కాని, నిఘంటువు చూడకండి. చూస్తే ఇటువంటి ప్రమాదాలే తటస్థమవుతాయి," అని మందలించాడు.





# మూడు సలహాలు

కాశీరాజ్యంలో ఒక బీద విద్యార్థి ఉండే వాడు. అతని పేరు ప్రసన్నచంద్రుడు. అతను విద్యాధ్యయనం ముగించి, కాశీ నగరంలో ఏదైనా ఉద్యోగం సంపాదించు కుందామని తన గ్రామం నుంచి కాలి నడకన బయలుదేరాడు. అతని పెత్తండ్రి అయిన సోమచంద్రుడు కూడా, ఒకప్పుడు, చదువు పూర్తికాగానే కాశీనగరానికి వెళ్ళి, శాస్త్ర పరీక్షలలో ఉత్తీర్ణుడై ధర్మాధికారిగా ఉద్యోగం సంపాదించి కొద్దికాలం క్రితమే చనిపోయాడు. తాను కూడా కాశీకి వెళ్ళి విద్వత్పరీక్షలలోనో, శాస్త్రపరీక్షలలోనో నెగ్గి ఏదైనా ఉద్యోగం సంపాదించు కుందామని ప్రసన్నచంద్రుడు నిశ్చయించు కున్నాడు.

అతను కాలి నడకన ప్రయాణిస్తూ ఒక రోజు సాయంకాలం ఒక గ్రామానికి చేరు కుని అక్కడి సత్రంలో బస చేశాడు. అగ కుండా వర్షం పడుతున్నది. చలి జాస్తిగా ఉన్నది. ప్రసన్నచంద్రుడు సత్రం యజ మానికి డబ్బిచ్చి ఒక బొగ్గుల కుంపటి తెప్పించుకుని చలి కాచుకుంటూండగా బయటి నుంచి ఒక బికారివాడు వచ్చి గడపలో నిలబడి వణకసాగాడు. ప్రసన్న చంద్రుడా దౌర్భాగ్యుడి స్థితి చూసి జాలి పడి, " నువు కూడా వచ్చి చలి కాచుకో," అన్నాడు. బికారి అలాగే చేశాడు.

ఇంతలోనే సత్రం యజమాని ఒక పళ్ళెంలో ప్రసన్నచంద్రుడికి భోజనం పంపాడు. బికారివాడి కళ్ళు పళ్ళెం మీదనే ఉండటం చూసి ప్రసన్నచంద్రుడా పళ్ళాన్ని వాడి కిచ్చేసి, భోజనం తెచ్చిన మనిషితో మరొక పళ్ళెంలో కూడా భోజనం తీసుకురమ్మని చెప్పాడు.

బికారివాడు తృప్తిగా భోజనం చేసి ఆ రాత్రి ప్రసన్నచంద్రుడి గదిలోనే పడు కున్నాడు. మర్నాడు ఉదయం వాడు వెళ్ళి

జి. వెంకటాచార్య

పోతూ, "అయ్యా, మీరు చూపిన దయకు ఎంతో కృతజ్ఞుణ్ణి. మీ రుణం తీర్చుకోవటానికి నా దగ్గిర డబ్బు లేదు. మీకు మూడు చిన్న పొట్లా లిస్తాను. వాటి మీద ఒకటీ, రెండూ, మూడూ అని అంకెలు వేసి ఉన్నాయి. ఏ సమయానైనా మీకు నిజంగా తీవ్రమైన సమస్య ఏర్పడి, అది పరిష్కారం అయే దారి కనిపించనప్పుడు మీరా పొట్లాలలో ఒకటి విప్పి చూసుకోండి. అందులో ఉన్న సలహా ప్రకారం చేసినట్టయితే మీకు లాభించవచ్చు. ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి. నిజమైన క్లిష్ట పరిస్థితి ఏర్పడితేనే గాని పొట్లాలను విప్పి చూడవద్దు; మరొక టేమిటంటే వాటిని ఒకటి, రెండు, మూడు వరసలోనే విప్పాలి," అని ప్రసన్నచంద్రుడికి మూడు కాగితం మడతలు, పొట్లాల్లాగా మడిచినవి ఇచ్చి శలవు పుచ్చుకున్నాడు.

ఆ బికారి మాటలను ప్రసన్నచంద్రుడు లక్ష్య పెట్టలేదు—యాచకులకు కోటి విద్యలు!—అయినా మర్యాదకు అతను ఆ పొట్లాలు తీసుకుని తన సంచీలో పుస్తకాల మధ్య పెట్టుకున్నాడు. బికారి వెళ్ళిపోయిన కొద్ది సేపటికి అతను కూడా సత్రం యజమానికి ఇవ్వవలిసిన డబ్బిచ్చి ప్రయాణం సాగించాడు.



ప్రసన్నచంద్రుడు కాశీకి చేరుకుని ఒక బస అద్దెకు తీసుకున్నాడు. అతను విద్వత్పరీక్షకు కూర్చున్నాడు, కాని నెగ్గలేకపోయాడు. అతను వెంట తెచ్చుకున్న కొద్ది డబ్బూ అయిపోయింది.

తిరిగి రెండేళ్ళదాకా పరీక్షలు జరగవు. అంతదాకా ఎలా జరిగేటట్టు? ప్రసన్నచంద్రుడి కేమీ పాలుపోలేదు.

ఆ సమయంలో అతనికి బికారివాడిచ్చిన కాగితాల మడతలు జ్ఞాపకం వచ్చాయి. తనది నిజంగా క్లిష్ట పరిస్థితే, దానికి పరిష్కారం లేదుకూడా. అందుచేత అతను "ఒకటి" గుర్తుగల మడత విప్పి చూశాడు.



అందులో, "సారనాథ ఆరామ ద్వారం వద్దకు వెళ్ళి కూర్చో!" అని రాసి ఉన్నది.

ఈ సలహా చూసి ప్రసన్నచంద్రుడు మొదట హతాశుడయాడు. కాని, కొంచెం ఆలోచించిన మీదట, ఆ సలహా ప్రకారం చేస్తే తనకు వచ్చే నష్టమేమీ లేదనిపించింది. అతని బసకు సారనాథారామం మూడు కోసులున్నది. ప్రసన్నచంద్రుడు అపరాహ్ణంవేళ బయలుదేరి సాయంకాలానికి ఆరామం చేరుకుని, దాని ద్వారం వద్ద, మెట్ల మీద కూర్చున్నాడు.

చీకటి పడే వేళకు ఆరామ పాలకుడు అటుగా వచ్చి, "నాయనా, ఇక్కడ కూర్చున్నావేమిటి? చీకటి పడిపోతున్నది. చలి హెచ్చుతున్నది. మీదే గ్రామమో, అక్కడికి వెళ్ళిపో," అన్నాడు.

"లేదు, బాబుగారూ. ఈ రాత్రికి నన్ని మెట్ల మీదనే పడుకోనివ్వండి," అన్నాడు ప్రసన్నచంద్రుడు.

"తెల్లవార్లూ ఇక్కడే పడుకుంటే తెల్లవారి మరి లేవవు. నీ కెక్కడికీ వెళ్ళే చోటు లేకపోతే ఆరామంలోకి వచ్చెయ్యి. నీ భోజనానికీ, పడకకూ ఏర్పాట్లు చూస్తాను," అని ఆరామపాలకుడు ప్రసన్నచంద్రుణ్ణి లోపలికి తీసుకుపోయాడు.

ఇద్దరూ కూర్చుని కబుర్లు చెప్పుకోవటంలో, కాశీనగరంలో ధర్మాధికారిగా పని చేసిన సోమచంద్రుడు ప్రసన్నచంద్రుడి పెత్తండ్రే నన్న విషయం బయటపడింది.

"నాయనా, ఇవాళ మనం కలుసుకోవటం చాలా మంచిదయింది. మీ పెత్తండ్రిగారు మా ఆరామానికి ఎంతో విరాళం ఇచ్చారు. దాని మాట అలా ఉంచి, ఆయన కొద్ది రోజులకు చనిపోతారనగా గయాక్షేత్రానికి బయలుదేరి వెళుతూ, నా వద్ద తన సొంత డబ్బు రెండు వేల మొహర్లు దాచబెట్టి, తిరిగి వచ్చేటప్పుడు తీసుకుంటానన్నారు. వారు తిరిగి వచ్చేలోపునే కాల

ధర్మం చెందారు. ఆ డబ్బు నా వద్దనే ఉండిపోయింది. కాశీలో ఎంత విచారించినా వారి వారసుల జాడ తెలియరాలేదు," అని చెప్పి ఆరామపాలకుడు ప్రసన్నచంద్రుడికి రెండు వేల మొహర్లు తెచ్చి ఇచ్చాడు.

ఆ డబ్బుతో ప్రసన్నచంద్రుడి దారిద్ర్యం తీరిపోయింది. అతను నగరంలో ఒక ఇల్లు కొనుక్కొని, సుఖంగా జీవించసాగాడు.

కాని పదవి సంపాదించాలన్న అతని కోరిక నెరవేరే మార్గం కనిపించలేదు. రెండేళ్ళ అనంతరం తిరిగి పరీక్షలు జరిగి నప్పు డతను మళ్ళీ నెగ్గలేకపోయాడు. రెండుసార్లు నెగ్గలేకపోయాక ఇంక నెగ్గలే నన్న అనుమానం అతన్ని పట్టుకున్నది. మూడోసారి పరీక్షలకు అతను పుస్తకాలు చదువుదామని వాటిని పైకి తీస్తుండగా, బికారివాడిచ్చిన కాగితం మడతలు రెండు కనిపించాయి.

తనకు ఏర్పడినది పరిష్కారం లేని సమస్యే గనక, ప్రసన్నచంద్రుడు "రెండు" గుర్తుగల చీటీ తీసి చూశాడు. అందులో, "ఉత్తరద్వారం వద్ద వున్న నందకిశోరుడి మిఠాయి అంగడికి వెళ్ళు," అని ఉన్నది.

ప్రసన్నచంద్రుడు ఆ మిఠాయి అంగడికి వెళ్ళి రొట్టెలూ, మిఠాయీ, పాలూ కావాలని నందకిశోరుణ్ణి హెచ్చరించి లోపలికి వెళ్ళి



కూర్చున్నాడు. లోపల ఇద్దరు పెద్దమను షులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. వారి సంభాషణను బట్టి వారు పరీక్షకులని ప్రసన్నచంద్రుడికి తెలిసింది. అతను వారి సంభాషణ అలకించాడు. వారిద్దరూ రాబోయే పరీక్షలలో ఏమేమి ప్రశ్న లడగబోతున్నదీ ఒకరి కొకరు చెప్పుకుంటున్నారు.

"నీ ప్రశ్నలలో ఒక్క దానికూడా నాకు సమాధానం తెలియదని చెప్ప వచ్చు," అన్నా డొక పరీక్షకుడు.

"మనమే ఇప్పుడు పరీక్షలకు కూర్చుంటే నెగ్గలేం!" అన్నాడు రెండవవాడు.

వాళ్ళు ఫలహారం ముగించి వెళ్ళి పోయాక ప్రసన్నచంద్రుడు వాళ్ళు అడగ బోయే ప్రశ్నలన్నీ జ్ఞాపకం ఉంచుకుని రాసుకున్నాడు.

ఈసారి పరీక్షలో అతను ఉన్నత శ్రేణిలో నెగ్గాడు. అతనికి న్యాయాధికారి పదవి వచ్చింది. అతను పెళ్ళి చేసుకుని పిల్లలను కని సుఖంగా జీవించసాగాడు. అధికారిగా కూడా అతను జనరంజకు డయాడు. అతని న్యాయనిర్ణయాలను రాజసభలో కూడా మెచ్చుకునేవారు.

ఎటువంటి సమస్యా లేకుండా ప్రసన్న చంద్రుడు చాలా కాలం జీవించి చివరకు జబ్బు పడ్డాడు. వ్యాధి చికిత్సలకు లొంగక పోగా తీవ్రం కాసాగింది. వైద్యు లేమీ చెయ్యలేక పోయారు. ఇంత కాలానికి తిరిగి ప్రసన్నచంద్రుడికి విషమ సమస్య ఏర్ప డింది. ఎక్కడో పడి ఉన్న మూడవ కాగితం మడత వెతికించి అది విప్పి చూసుకుంటే, అందులో, "మరణశాసనం తయారు చేసుకో," అని ఉన్నది.

ప్రసన్నచంద్రుడు ఇదే తన ఆఖరు సమస్య అని గ్రహించి, తన ఆస్తి ఎవరెవరి కెలా పంచాలో సూచిస్తూ మరణశాసనం తయారు చేసి, అందరికీ అప్పగింతలు చెప్పి నిశ్చింతగా దేహం చాలించాడు.





# యుద్ధకాండ

అకంపనుడు చెప్పిన వార్త విని రావణుడికి కోపం వచ్చింది. అతను సభ నుంచి బయలుదేరి, తన వ్యూహాలను చూసుకుంటూ ఒక సారి లంక అంతా తిరిగి వచ్చాడు. అతను లంక చుట్టూ ఉన్న వానరుల ముట్టడి కూడా చూశాడు; సభకు తిరిగి వచ్చి, ప్రహస్తుణ్ణి చూసి, "వానరుల ముట్టడిని విచ్ఛిన్నం చెయ్యటం ఇతరుల వల్లకాదు; దానికి నేనూ, నీవూ, కుంభకర్ణుడూ, ఇంద్రజిత్తూ, నికుంభుడూ మాత్రమే సమర్థులం. నీవు సేనతో వెళ్ళి, వానరులను జయించిరా," అన్నాడు.

సీతను రాముడి కిచ్చేసి సంధి చేసుకోవటమే మంచి దనుకున్న వారిలో ప్రహస్తుడు కూడా ఉన్నాడు. సంధి జరగలేదు. అందుచేత తప్పనిసరిగా యుద్ధం సంప్రాప్తమయింది. యుద్ధం వస్తే రావణుడి కోసం ప్రాణాలు విడవటానికైనా ప్రహస్తుడు సిద్ధమే. అతను రథమెక్కి, యుద్ధానికి బయలుదేరాడు.

ఆర్భాటంగా వస్తున్న ప్రహస్తుణ్ణి చూసి రాముడు, "ఆ వచ్చేదెవరు? చాలా పరాక్రమవంతుడిలాగా కనిపిస్తాడు!" అన్నాడు విభీషణుడితో.

"అతను ప్రహస్తుడు. అస్త్రా లెరిగిన శూరుడు. రావణుడి సేనలో మూడోవంతు అతని అధీనంలో ఉంటుంది," అని విభీషణుడు చెప్పాడు.

ఈ లోపల వానరవీరులు ప్రహస్తుణ్ణి చూసి సింహనాదాలు చేశారు. వాళ్ళు



చెట్లూ, రాళ్ళూ పట్టుకుని యుద్ధానికి సిద్ధంగా నిలబడ్డారు. యుద్ధంలో ఉభయ పక్షాలా ప్రాణ నష్టం జరిగింది. నరాంతకుడూ, కుంభహనుడూ, మహానాదుడూ, సమున్నతుడూ అనే రాక్షస యోధులు అంతులేని వానరులను చంపి, ద్వివిదుడూ, దుర్ముఖుడూ, జాంబవంతుడూ, తారుడూ అనే వానరవీరుల చేతుల్లో చచ్చారు. నీలుడు ప్రహస్తుణ్ణి ఎదుర్కొని, భయంకరంగా పోరాడి, తీవ్రంగా గాయపడి, చివరకు ప్రహస్తుడి తల చితకగొట్టి చంపేశాడు. ప్రహస్తుడు పోవటంతో, చావగా మిగిలిన రాక్షసులు భయకంపితులై లంకలోకి పారి పోయారు. నీలుణ్ణి రామలక్ష్మణులూ, సుగ్రీవుడూ, ఇతరులూ ఎంతో మెచ్చుకున్నారు.

ప్రహస్తుడి మరణ వార్త విని రావణుడికి కసీ, దుఃఖమూ కూడా కలిగాయి. అతను తనను పరివేష్టించి ఉన్న రాక్షసవీరులతో, "దేవతలను జయించగల ప్రహస్తుణ్ణి చంపారంటే వానరులు సామాన్యులుకారు. ఇంక నేను ఉపేక్షించటానికి లేదు. నేనే స్వయంగా యుద్ధానికి పోతాను ; నా బాణాలతో ఆ రామలక్ష్మణులనూ, వానరసేననూ దగ్ధం చేస్తాను," అన్నాడు.

రావణుడు తన రథ మెక్కి, సేనను వెంట బెట్టుకుని వానరుల పై యుద్ధం చెయ్యటానికి బయలుదేరి వెళ్ళాడు. ఆ సేనలో రావణుడి కొడుకులైన అకంపనుడనే వాడూ, ఇంద్రజిత్తూ ఉన్నారు.

విభీషణుడు రాముడికి వారందరినీ గురించి వేరు వేరుగా చెప్పాడు. రాముడు రావణుడి తేజస్సునూ, అతని యోధులు పట్టిన ఆయుధాలనూ చూసి ఆశ్చర్య చకితుడయాడు.

రావణుడు తన వెంట వచ్చిన రాక్షస వీరులతో, "మీరు తిరిగి వెళ్ళి లంకా నగరాన్ని కాపాడండి, లేకపోతే నిర్జనమైన

లంకను శత్రువులు తేలికగా ఆక్రమించుకో గలరు," అని చెప్పాడు.

రావణుడు యుద్ధానికి వస్తుండగానే సుగ్రీవు డతన్ని ప్రతిఘటించాడు. రావణుడు వేసిన బాణాలకు సుగ్రీవుడు త్వరలోనే తెలివి తప్పి పడి పోయాడు.

వానరసేనను కాపాడే భారం రాముడి పైన పడింది. అతను విల్లు పట్టి రావణుడితో తలపడటానికి ఉద్యుక్తుడౌతుండగా, లక్ష్మణుడు రాముడితో, "వీణ్ణి చంపటానికి నీవు కావాలా? నన్ను పోనీ!" అన్నాడు.

"వెళ్ళు. యుద్ధం జాగ్రత్తగా చెయ్యి," అన్నాడు రాముడు. ఎందుకంటే రావణుడు మహా యోధుడు.

లక్ష్మణుడు రావణుడి పైకి వచ్చేలోపల హనుమంతుడు రావణుడి రథం పక్కన చేరి, కుడి చెయ్యి ఎత్తి, "నిన్నిప్పు డొక్క గుద్దుతో చంపబోతున్నాను," అన్నాడు.

"నన్ను తప్పకుండా కొట్టు. ఒక కోతి రావణుణ్ణి కొట్టింది అన్న ఖ్యాతి కలకాలం ఉండిపోతుంది. నీవు నన్ను కొట్టిన మరు క్షణం నీ ప్రాణాలు తీస్తాను," అన్నాడు రావణుడు.

"నా చేతి దెబ్బకు నీ కొడుకు అక్షుడు చచ్చిన సంగతి మరిచిపోకు," అన్నాడు



హనుమంతుడు. ఈ మాట విని రావణుడు హనుమంతుడి రొమ్ముమీద అరచేత్తో ఒక్క దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు హనుమంతుడు క్షణంపాటు దిమ్మరపోయి, రావణుడి రొమ్ము మీద తన అరచేత్తో ఒక్క చరుపు చరిచాడు. ఆ దెబ్బకు రావణు డదిరి పోయాడు. రావణుడు కాస్త పుంజుకుని, "భేష్! పగవాడి వైతేనేం? నీ బలం చాలా గొప్పది!" అన్నాడు.

"నా బలం తగలబెట్టనా? నా చేత దెబ్బ తిని కూడా నీ వింకా బతికే ఉంటివి! మళ్ళీ ఒకసారి దెబ్బ కొట్టు, ఆ తరవాత నా పిడికిలి పోటుతో నిన్ను యముడి దగ్గిరికి



పంపేస్తాను," అన్నాడు హనుమంతుడు. రావణుడు మండిపడి, తన పిడికిలితో హనుమంతుడి రొమ్ములో భయంకరంగా పొడిచి, హనుమంతుడు తెప్పరిల్లే లోపుగా నీలుడితో యుద్ధానికి వెళ్ళాడు. నీలుడితో యుద్ధం చేస్తున్న రావణుడితో హనుమంతుడు, "మరొకరితో పోట్లాడే వాడి పైకి పోవటం యుక్తం కాదు గనక నిన్నీసారికి పోనిచ్చాను," అన్నాడు.

నీలుడు రావణుడితో అతి విచిత్రమైన యుద్ధం చేశాడు. అతను అతి చిన్న దేహం ధరించి రావణుడి టెక్కెం పైన వాలాడు. అతనికి బాణం గురిచేసి కొట్టటం రావణుడికి అసాధ్యమయింది. నీలుణ్ణి చూసి రామలక్ష్మణ హనుమంతులాశ్చర్యపడ్డారు. చివరకు రావణుడు నీలుణ్ణి ఆగ్నేయాస్త్రంతో పడగొట్టాడు. అయితే, అగ్నిదేవుడు నీలుడికి తండ్రే గనక ఆగ్నేయాస్త్రం అతన్ని నేలపై పడగొట్టిందే గాని, అతని ప్రాణాలు తియ్యలేదు.

అప్పుడు లక్ష్మణుడు రావణుణ్ణి ఎదిరించాడు. ఇద్దరికీ జరిగిన యుద్ధంలో ఒకరినొకరు మూర్ఛ పోగొట్టుకున్నారు. చివరకు రావణుడు లక్ష్మణుడి పైన ఒక శక్తిని ప్రయోగించాడు; అది అతనికి బ్రహ్మ ఇచ్చినది. అది రొమ్ములో తగిలే సరికి లక్ష్మణుడు మూర్ఛపోయాడు. అప్పుడు రావణుడు లక్ష్మణుడి వద్దకు వచ్చి, అతన్ని తన చేతులలో ఎత్తటానికి ప్రయత్నించాడు, కాని సాధ్యం కాలేదు.

ఇంతలో హనుమంతుడు వచ్చి రావణుణ్ణి తన పిడికిలితో రొమ్ములో పొడిచాడు. ఆ దెబ్బకు రావణుడు మోకాళ్ళ పైన ముందుకు పడిపోయి, రక్తం కక్కుకుని, తన రథం మీద స్పృహ తప్పి పడిపోయాడు. హనుమంతుడు లక్ష్మణుణ్ణి తన చేతులలో ఎత్తుకుని రాముడి వద్దకు తెచ్చాడు. కొద్ది సేపటిలో లక్ష్మణుడికి

మూర్ఛ తెలిసింది. రావణుడికి కూడా స్పృహ వచ్చింది.

హనుమంతుడు రాముడితో, "నా వీపు మీద ఎక్కి రావణుడితో యుద్ధం చెయ్యి," అన్నాడు. రాముడా ప్రకారమే హనుమంతుడి భుజాల పైన ఎక్కి కూర్చున్నాడు. హనుమంతుడు రాముణ్ణి రావణుడి ఎదటికి తీసుకు పోయాడు.

రావణుడు హనుమంతుణ్ణి తీవ్రమైన బాణాలు వేసి కొట్టాడు. అది చూసి రాముడు క్రోధంతో రావణుడి రథ చక్రాలనూ, గుర్రాలనూ, ధ్వజాన్నీ, సారథినీ నాశనం చేసి, రావణుడి రొమ్ములో పిడుగులాటి బాణాన్ని నాటాడు. ఆ దెబ్బకు రావణుడు పడిపోగా మరొక బాణంతో అతని కిరీటాన్ని భగ్నం చేసేసి, "రాక్షసరాజా, చాలా గొప్ప యుద్ధం చేసి అలిసిపోయి ఉన్నావు. అందు చేత నిన్నిప్పుడే యమపురానికి పంపను. లంకకు తిరిగి వెళ్ళటానికి అనుమతిస్తున్నాను. వెళ్ళి, విశ్రాంతి తీసుకుని, రథమెక్కి, బాణం పట్టుకుని మళ్ళీరా. అప్పుడు నా శక్తి చూపుతాను," అన్నాడు.

రావణుడు గర్వభంగం పొంది, సిగ్గు పడుతూ లంకకు తిరిగి వెళ్ళాడు. అతనికిప్పుడు రాముడంటే నిజంగా భయం పట్టు



కున్నది. అతను రాక్షసులను సమావేశ పరిచి ఇలా అన్నాడు:

"ఇంద్రుడికి తీసిపోని నేను ఒక మనుష్య మాత్రుడికి ఓడిపోయాను! నా తపస్సంతా ఏమయిందో తెలియటం లేదు. నాకు మనుష్యుల వల్ల ప్రమాదం ఉంటుందని ఒకప్పుడు బ్రహ్మ చెప్పాడు. వెనక నేను అనరణ్యుడనే ఇక్ష్వాకు రాజును చంపేటప్పుడు, నన్ను సర్వ నాశనం చేయగలవాడు తన కులంలోనే జన్మిస్తాడని ఆయన అన్నాడు. వెనక వేదవతిని బలాత్కరించి ఆవిడ చేత శాపం తిన్నాను. ఆ వేదవతే ఈ సీత. పార్వతీ,



నందీశ్వరుడూ, రంభా, పుంజికస్థలా ఏమేమి అన్నారో, అదంతా ఈనాడు నిజం అవుతున్నది. ప్రమాదం మనసులో ఉంచుకుని శత్రుసంహారం విషయంలో మీరు మరింత శ్రద్ధవహించండి. ద్వారాలనూ, గోపురాలనూ శ్రద్ధగా కాపలాకాయండి. కుంభకర్ణుడు నిద్రపోతున్నాడు. అతన్ని లేపండి. నే నిక్కడ నానా అవస్థా పడుతూంటే అతను హాయిగా నిద్రపోతున్నాడు. యుద్ధాలోచన చేసేటప్పుడు కూడా మేలుకునే ఉన్నాడు. అటువంటి వాడు, తొమ్మిది రోజులకు యుద్ధం ఆరంభ మవుతుందనగా నిద్రపోయాడు. అతన్ని లేపండి. నాలాగా అతను శాపాలకు గురి అయినవాడు కాడు. అవలీలగా వానరసేననూ, రామ లక్ష్మణులనూ నిర్మూలించగల వాడు. రాముడి చేత దెబ్బ తిన్న నాకు కుంభకర్ణుడు లేస్తే ధైర్యంగా ఉంటుంది. కుంభకర్ణుడు ఇటువంటి తరుణంలో పక్కన లేకపోతే అతను ఉండీ ప్రయోజనమేమిటి?"

రావణుడీ మాట అనగానే రాక్షసులు కుంభకర్ణుడి ఇంటికి బయలుదేరారు. వాళ్ళు తమ వెంట గంధమూ, పూల మాలలూ, ఆహారమూ పట్టుకు పోయారు. ఒక బ్రహ్మాండమైన గుహలాటి ఇంట కుంభకర్ణుడు పడుకుని నిద్రపోతున్నాడు. అతను విడిచే ఊపిరి, రాక్షసులు లోపలికి ప్రవేశించటానికి యత్నిస్తే, బయటికి తోసేసింది. అతి కష్టం మీద వాళ్ళు చివరికి గుహలోపలికి వెళ్ళారు.

కుంభకర్ణుడు భయంకరమైన ఆకారంతో పడుకుని గాఢ నిద్రలో ఉన్నాడు. అతని ముందు రకరకాల మాంసాలు పెట్టి ఉన్నాయి. అన్నం రాసులుగా పోసి ఉన్నది. మద్యమూ, నెత్తురూ కడవలలో ఉన్నాయి. అతన్ని లేపటానికి రాక్షసులు విశ్వప్రయత్నాలు చేశారు—అందరూ కలిసి గట్టిగా అరిచారు, భయంకరమైన ధ్వనులు చేశారు,



గదలతోనూ, రోకళ్ళతోనూ అతని శరీర మంతా బాదారు. కుంభకర్ణుడు నిద్రలేవక పోగా, కదలనైనాలేదు.

రాక్షసులకు మండి పోయింది. వాళ్ళు ఏనుగుల చేత కుంభకర్ణుణ్ణి తొక్కించారు. ఏవో పురుగులు పాకు తున్నట్టనిపించి కుంభ కర్ణుడు మేలుకున్నాడు. అతను లేచి కూర్చుని పెద్ద పెట్టున ఆవలించాడు.

కుంభకర్ణుడు నిద్రలేస్తూనే మాంసం తిని, మద్యం తాగి చుట్టూ కలయ జూసి, రాక్షసులతో, "మీరంతా వచ్చి నన్నెందుకు నిద్ర లేపారు? రావణుడికి క్షేమమేగదా? ఏదో విపత్తు వచ్చిపడి ఉంటుంది. అందుకే మీరింత తొందరపడి నన్ను నిద్ర లేపారు. సంగతేమిటో చెప్పండి," అన్నాడు.

కుంభకర్ణుడు పడుకుంటే మూడు నెలలూ, ఆరు నెలలూ, ఒక్కొక్కప్పుడు తొమ్మిది నెలలు కూడా నిద్ర పోయేవాడు.

రావణుడి మంత్రి యూపాక్షు డనేవాడు కుంభకర్ణుడితో, "కుంభకర్ణా! పూర్వం దేవతల వల్ల కూడా కలిగి ఉండనంతటి భయం ఇప్పుడు మానవుల వల్ల కలిగింది. కొండలంతేసి వానరులు లంకను ముట్టడించి ఉన్నారు. సీతను ఎత్తుకు వచ్చినందు కాగ్రహించి రాముడీ పని చేశాడు. కొంత



కాలం క్రితం ఒక వానరుడు వచ్చి లంకను తగలబెట్టి, అక్షకుమారుణ్ణి చంపేశాడు. దేవతలనందరినీ జయించిన రావణుణ్ణి రాముడు కొస ప్రాణంతో విడిచిపెట్టాడు. ఏ దేవతలూ చెయ్యలేని పని ఇప్పుడా రాముడు చేశాడు," అన్నాడు.

తన అన్న అపజయ వార్త విని కుంభకర్ణుడు కోపోద్రేకంతో గుడ్లు గుండ్రగా తిప్పుతూ, "నేనా వానరసేననూ, రామలక్ష్మణులనూ చంపేసి తరవాత రావణుణ్ణి చూస్తాను. రామలక్ష్మణుల రక్తం నేను తాగి, వానరుల రక్తం రాక్షసుల చేత తాగిస్తాను," అన్నాడు.



మహోదరుడనే రాక్షస ప్రముఖుడు కుంభకర్ణుడికి చేతులు జోడించి, "కుంభకర్ణా, నీవు రావణుడి వద్దకు వచ్చి, ఆయన చెప్పేది విని, మంచి చెడ్డలు సరిగా ఆలోచించుకుని, ఆపైన శత్రువుల పైకి యుద్ధానికి పోతే విజయం పొందటానికి వీలుగా ఉంటుంది," అన్నాడు.

కుంభకర్ణుడందుకు సమ్మతించి రాక్షసుల నందరినీ వెంట బెట్టుకుని రావణుడి ఇంటికి వెళ్ళటానికి సిద్ధమయాడు. రాక్షసులు ముందు వెళ్ళి రావణుడి దర్శనం చేసుకుని, "మీ తమ్ముడు కుంభకర్ణుణ్ణి నిద్ర లేపాం? ఏమి శలవు? అతను తిన్నగా యుద్ధానికి వెళ్ళవచ్చునా? లేక ఇక్కడికి రావాలా?" అని అడిగారు.

కుంభకర్ణుడు మేలుకున్నాడని విని రావణుడు సంతోషించి, "అతన్ని సగౌరవంగా ఇక్కడికే తీసుకురండి," అని రాక్షసులతో అన్నాడు. వాళ్ళు కుంభకర్ణుడి వద్దకు తిరిగి వెళ్ళి రావణుడు రమ్మంటున్నాడని చెప్పారు.

కుంభకర్ణుడు రావణుడి ఇంటికి బయలుదేరాడు. అతను అంగ వేస్తుంటే భూమి దద్దరిల్లింది. దారి పొడుగునా ఎదురైన రాక్షసులతనికి నమస్కారాలు చేశారు. లంక బయటి నుంచి అతన్ని చూసి వానరులు దడుచుకున్నారు. కొందరు వానరులు పారి పోసాగారు.

రాముడు కుంభకర్ణుణ్ణి చూసి విభీషణుడితో, "లంకలో పర్వతాకారుడైన వీరుడొకడు కిరీటం ధరించి కనబడుతున్నాడే ఎవరతను? అతన్ని చూసి మన వానరులు పారిపోతున్నారు!" అన్నాడు.

"అతను కుంభకర్ణుడు. యుద్ధంలో ఇంద్రుణ్ణీ, యముణ్ణీ గెలిచినవాడు. రాక్షసులలో అంత పెద్ద శరీరం కలవాడు లేడు. అతని బలం సహజమైనది, వరాల వల్ల వచ్చినది కాదు," అన్నాడు విభీషణుడు.





# పృథు చక్రవర్తి

వేనుడు తన దుష్టత్వాన్ని వదులుకోడని రూఢి చేసుకుని మునులు అతన్ని చంపేసి వెళ్ళిపోయిన అనంతరం, వేనుడి తల్లి సునీథ కొడుకు కోసం శోకించి, అతని కళేబరాన్ని చెడిపోకుండా కాపాడుతూ వచ్చింది.

వేనుణ్ణి చంపి వెళ్ళిన మునులు సరస్వతీ నదిలో స్నానం చేసి, అగ్ని హోత్రాలు వేల్చి, నది ఒడ్డున కూర్చుని సత్కథాగోష్టిలో కాలం వెళ్ళబుచ్చుతూండగా ఒకనాడు అనేకమైన ఉత్పాతాలు తోచాయి. రాజులేని కారణంచేత బంది పోటు దొంగలు విజృంభించి ప్రజలను దోచుకోసాగారు. హత్యాకాండ కూడా సాగింది. అరాజకస్థితి ఏర్పడింది.

అలాటి స్థితి ఏర్పడటానికి కారణం ఆ మునులే గనక, దీని కేదన్నా ప్రతిక్రియ చేయాలని వారనుకున్నారు. అదీగాక అంగుడి వంశం వేనుడితో అంతరించటం కూడా వారి కిష్టంలేదు. వేనుడి కళేబరాన్ని సునీథ కాపాడుతున్న సంగతి కూడా వారికి తెలిసింది. మునులు సునీథ వద్దకు వెళ్ళి, వేనుడి కళేబరం యొక్క తొడను మథించారు.

దాని ఫలితంగా వేనుడి తొడ నుంచి ఒక వికారాకారుడు పుట్టుకొచ్చాడు. వాడి శరీరం కాకి నలుపు. పొట్టివాడు. చిన్నచిన్న చేతులూ, చిన్నచిన్న పాదాలూనూ. వాడి కళ్ళూ, జుట్టూ ఎర్రగా ఉన్నాయి. వాడి పేరు బాహుకుడు. వాడు వినయంగా మును లకు నమస్కారం చేసి, "నన్నేం చెయ్య మన్నారు?" అని అడిగాడు. మునులు వాడితో "నిషీద" అన్నారు. "నిషీద" అంటే "కూర్చో" అని అర్థం. మునుల చేత "నిషీద" అని అజ్ఞాపించబడటం చేత వాడికి నిషాదు డనే పేరు వచ్చింది. వాడి



సంతతివాళ్ళు కొండల్లోనూ, అడవుల్లోనూ నివాసా లేర్పరచుకున్నారు.

బాహుకుడితో బాటు వేనుడి శరీరం నుంచి కల్మష మంతా బయటికి వచ్చిన మీదట, మునులు వేనుడి చేతులు మథించారు. వాటి నుంచి ఒక పురుషుడూ, ఒక స్త్రీ పుట్టారు. వారిద్దరూ దేవాంశ సంభూతులుగా కనిపించారు. మునులా పురుషుడికి పృథువు అని పేరు పెట్టారు. అతని కుడి చేతిలో చక్రమూ, కాలిలో పద్మమూ ఉన్నాయి. మునులు పృథువును రాజుగా అభిషేకించారు. అతని రాజ్యాభిషేకానికి సకల దేవతలూ కానుక లిచ్చారు. అతను రాజలాంఛనాలూ, అలంకారాలూ ధరించి, తనతోనే పుట్టిన అర్చిస్సు అనే ఆమెను భార్యగా చేసుకున్నాడు.

పృథువు రాజైన మాత్రాన ప్రజల కష్టాలు తీరలేదు. వారు ఆకలితో మలమల మాడుతున్నారు. భూమి పైన మెతుకు లేదు. పృథుడు భూదేవి పైన ఆగ్రహించి, విల్లు పట్టి, బాణం సంధించి భూమిని కొట్టబోయాడు. భూదేవి భయపడి, గోవు రూపం ధరించి పారిపోసాగింది. పృథువు ఆమె వెంట పడ్డాడు.

"నన్నెందుకు చంప బూనుకున్నావు? స్త్రీ హత్య తగునా?" అని గోరూపం ధరించిన భూదేవి పృథువు నడిగింది.

"బ్రహ్మ ఇచ్చిన ఓషధుల నన్నిటినీ మాయం చేసి, ప్రజలకు ధాన్యాదులు లేకుండా చేసిన నిన్ను చంపటం తప్పు కాదు," అన్నాడు పృథువు.

"నన్ను చంపి నీవూ, నీ ప్రజలూ ఎలా బతుకుతారు?" అన్నది భూదేవి.

"నీ కొవ్వు ఆకలితో మాడే వారికి పెడతాను. నీ మాంసం తిని ప్రజలు బతుకుతారు," అన్నాడు పృథువు.

"రాజా, ఆగ్రహించక, నేను చెప్పేది శ్రద్ధగా విను. రాజులు నన్ను సరిగా పాలిం

చక, దొంగలు పెచ్చుమీరే దుస్థితి ఏర్పడి నప్పుడు బ్రహ్మ సృష్టించిన ఓషధు లన్ని టినీ నేను మింగాను. ఇప్పు డవి జీర్ణమై పోయాయి. తేనెటీగలు పూల నుంచి తేనె సంగ్రహించినట్టుగా, తెలివి గలవాడు దేని నుంచి అయినా సారం తీసుకోవచ్చు. మేధావంతులైనవారు అలాటి యోగాలనేకం అదివరకే కనిపెట్టారు. ఒక దూడనూ, పాత్రలనూ, పితికేవాళ్ళనూ తెచ్చావంటే, నేను జీర్ణించుకున్న ఓషధుల సారమంతా ఒక్కసారిగా నీ కిచ్చేస్తాను. నన్ను చదునుగా దున్ని, వర్షంలేని ఋతువులలో కూడా నీటి మడుగులు ఏర్పాటు చేసుకో, నీ ప్రజలకు సమృద్ధిగా అన్నం ఇస్తాను," అన్నది భూదేవి.

ఆ మాట విని పృథువు తృప్తిపడి, మనువును దూడగా చేసి, తానే స్వయంగా ఆ ఆవును పితికాడు.

అతని కోరిక తీరింది. ఆవుపాలతో ప్రజలు తృప్తిచెందారు.

తరవాత పృథువు భూమి యావత్తూ సమంగా దున్నించి, వ్యవసాయం ప్రారంభించి; గ్రామాలూ, పురాలూ, పట్టణాలూ మొదలైనవి నిర్మింపజేసి ప్రజలకు క్రమ జీవితం ఏర్పాటు చేశాడు.




తరవాత పృథుచక్రవర్తి బ్రహ్మావర్త మనబడే మనుక్షేత్రంలో అశ్వమేధ యాగాలు చేయ తలపెట్టి, తొంభైతొమ్మిది అశ్వమేధాలు చేశాడు.

ఇంద్రుడి కిది నచ్చలేదు. నూరు యజ్ఞాలు చేసిన వారికి ఇంద్రత్వం లభిస్తుంది. అందుకే ఇంద్రుడికి శతమఖుడని పేరు.

పృథువు నూరో అశ్వమేధానికి ఉపక్రమించటం చూసి, దాన్ని కొనసాగనిస్తే తన ఇంద్ర పదవికి తప్పక ఎసరు వస్తుందని భయపడి, ఇంద్రుడు నూరవ యాగాశ్వాన్ని అపహరించి తీసుకుపోసాగాడు.



69

ఈ సంగతి అత్రిమహాముని కనిపెట్టి, పృథువు కొడుకును పిలిచి, "ఇంద్రుడు యాగాశ్వాన్ని ఎత్తుకుపోతున్నాడు చూడు," అని చెప్పాడు.

విల్లూ, బాణాలూ తీసుకుని ఆ కుర్రవాడు వెంటపడే సరికి ఇంద్రుడు గుర్రాన్ని వదిలి మాయమైపోయాడు.

గుర్రాన్ని తిరిగి తీసుకువచ్చిన పృథుపుత్రుడికి విజితాశ్వుడనే పేరు వచ్చింది. కాని ఇంద్రుడా అశ్వమేధాన్ని కొనసాగనివ్వక మళ్ళీ యాగాశ్వాన్ని కాజేశాడు. పృథువుకు పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను యజ్ఞదీక్షతో ఉండే ఇంద్రుణ్ణి చంపేస్తానని బయలుదేరాడు.

అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమై, "నాయనా, నీవు ఇంద్రుణ్ణి చంపటమేమిటి? నీవు యాగం చేస్తే రావలిసిన దేవతలు ఇతని కిందివారే గదా! తొంభై తొమ్మిది అశ్వమేధాలు చేశావు. అంతటితో తృప్తిపడి ఈ నూరవ యాగాన్ని విరమించుకో," అంటూ ఇంద్రుడికీ పృథువుకూ సంధి చేశాడు.

తరవాత పృథువు యజ్ఞశాల నుంచి పురానికి తిరిగి వచ్చాడు. అతను చాలా కాలం తన ప్రజలకు సమస్త సుఖాలూ కలిగేలాగా రాజ్యం చేశాడు. అతను నివసించినది గంగా యమునా మధ్య దేశంలోనే అయినప్పటికీ సప్తద్వీపాలనూ పాలించాడు. ప్రజలకు అనుకూలించే ధర్మశాసనాలు చేశాడు. చివరకతను వృద్ధదశలో రాజ్యాన్ని కొడుకులకు ఇచ్చేసి, తన భార్యతో సహా అరణ్యానికి వెళ్ళి వానప్రస్థాశ్రమం స్వీకరించాడు.

పృథువు అనంతరం విజితాశ్వుడు చక్రవర్తి అయి కూడా తన తమ్ములకు మూడు దిక్కుల రాజ్యం ఇచ్చేసి తాను వారి పైన సార్వభౌముడుగా ఉంటూ రాజ్యమేలాడు.



ప్రపంచపు వింతలు :

# 37. చంద్ర పర్వతాలు

వీటిని ఆఫ్రికా వారు "రువెంజోరి" (వర్షకారకం) అంటారు. ఈ కొండలలో ఎవరూ ఉండరు. అస్తమానమూ పొగమంచూ, చలీ ఉంటుంది. చెట్లన్నీ నీరు ఓడుతూ ఉంటాయి. అంతటా నిశ్శబ్దం ఆవరించి ఉంటుంది. మామూలు చెట్లే ఇక్కడ రాక్షసి ప్రమాణంలో పెరుగుతాయి; ఇందుకు కారణం తెలియదు. నేల అంతా పాచిమొక్కల మయంగా ఉండి, పాకుడు వానన వెద జల్లుతూంటుంది. వాటిలో మూడేసి అడుగుల నిడివిగల పురుగులుంటాయి. ఇక్కడికి వెళ్ళిన వారికి మరో లోకంలో ఉన్నట్టు భావన కలుగుతుంది.

ఈ పర్వతాలు ఆఫ్రికాలో భూమధ్యరేఖ పైన, ఉగాండా, కాంగోల సరిహద్దులు కలిసేచోట ఉన్నాయి. **60** మైళ్ళు పొడుగూ, **30** మైళ్ళు వెడల్పూ గల ప్రదేశాన్ని ఆక్రమించిన ఈ కొండల శిఖరాల మీద ఎల్లప్పుడూ మంచు ఉంటుంది; హిమాని నదాలుకూడా ఉన్నాయి. శిఖరాల ఎత్తు ఇంచుమించు **16,000** అడుగులు.

ఈ పర్వతాలలో మనిషికి హాని కలిగించే జంతువులు ఏనుగులూ, చిరుత పులులూనూ. ఇంకా అనేకమైన జంతువులు కూడా ఉన్నాయి. అందులో కొన్ని వింత ప్రాణులు. అవి మరెక్కడా ఉండవు. వాటిలో ఒకటి "కొండ కుందేలు." ఇది చూడటానికి కొద్దిగా కుందేలును పోలి ఉంటుంది గాని వాస్తవానికి కుందేలు జాతికి చెందినది కాదు; ప్రాచీన ఏనుగులకూ, ఖడ్గమృగాలకూ చెందినది. ఇది ఉచ్చస్వరంలో కూత పెడుతుంది. ఇది కాక ఇక్కడ ఒక చిత్రమైన ఊసరవెల్లి ఉన్నది. దాని నుదురున మూడు కొమ్ములుంటాయి. (బొమ్మ చూడండి.)



Photo by P. R. Shinde



బహుమతి
పొందిన వ్యాఖ్య

తిప్పితే పైకి

పంపినవారు :
బి. ఎస్. దేవి, పాలకొల్లు

Photo by Sundaramurthy



బహుమతి
పొందిన వ్యాఖ్య

తప్పితే కిందికి

పంపినవారు :
బి. ఎస్. దేవి, పాలకొల్లు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1965 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : తిప్పితే పైకి

రెండవ ఫోటో : తప్పితే కిందికి

పంపినవారు : బొండా సుజాతాదేవి,

c/o బి. శ్రీరామచంద్రమూర్తి, పాలకొల్లు (ప. గోదావరి జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారణ చేసుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా బెణుకులకు కండరాల నొప్పులకు తలనొప్పికి ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకు సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది. కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతా కలిపి నెలలు తరబడి వస్తుంది. అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పుల జలుబుల
నివారణకు 10 రకాల ఔషధాలు
చేరిన మందు

**బెణుకునొప్పి**
ఎంత ఎక్కువగా ఉన్నా
**బెణికినచోటేకదా!**




అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2818